SUNDAY MAGAZINE

# ఆదివారం ఆంధ్రజ్యోతి

5 ఫిబ్రవరి 2017










# ఆర్గానిక్ బాటసారులు




# యువరానర్...

ఫిల్మ్‌నగర్

సినిమాల్లో కోర్టు సీన్లు చాలా కామనే. హీరోలు కామెడీ చేసేందుకో, విలన్లకు శిక్ష వేసేందుకో ఒకటీ అరా సీన్లలో కోర్టులను చూపడం ఒకెత్తయితే... నల్లకోటు వాదనల నేపథ్యంలో రూపుదిద్దుకునే 'కోర్టు డ్రామా'లు మరొక ఎత్తు. విషయం ఉంటే కోర్టు డ్రామాలు కూడా తెరపై అద్భుతంగా పండుతాయని చాలాసార్లు రుజువైంది. ఆ మధ్య అర్షద్‌వార్సి 'జాలీ ఎల్‌ఎల్‌బి'గా ఆకట్టుకున్న సంగతి తెలిసిందే. దాని సీక్వెల్‌కు స్టార్ స్టామినాను జతచేసి (అర్షద్ స్థానంలో అక్షయ్‌కుమార్‌ను పెట్టారు) 'జాలీ ఎల్‌ఎల్‌బి 2' పేరుతో త్వరలోనే విడుదల చేస్తున్నారు. అమితాబ్ 'పింక్', పరేశ్‌రావల్ 'ఓ మై గాడ్', ఐశ్వర్యరాయ్ 'జస్బా', అక్షయ్‌కుమార్ 'రుస్తుం' వంటి అనేక సినిమాలు ఇటీవల కోర్టుల చుట్టే తిరిగాయి. గతంలో సన్నిడియోల్ (దామిని), అనిల్‌కపూర్ (మేరీ జంగ్)లతో పాటు అనేక మంది హీరోహీరోయిన్లు కూడా కోర్టు మెట్లు ఎక్కి 'యువరానర్' అని వాదించి గెలిచారు.











## ఇండెక్స్






ఆదివారం ఆంధ్రజ్యోతి
5 ఫిబ్రవరి 2017


## ఇన్‌బాక్స్

### 'సెంట్' గుబాళించింది!

ఈ వారం కవర్‌స్టోరీ 'సెంట్ పర్సెంట్ లైఫ్ స్టైయిల్' చాలా బాగుంది. మత్తెక్కించే మల్లెలు, గుబాళించే గులాబీలు, సువాసన వెదజల్లే సన్నజాజులు, సంపెగలు... మూణ్ణాళ్లుండే పూలే అయినా మనసుకెంత హాయినిస్తాయని! వాటి అందం నయనానికి ఆనందాన్నిస్తే.. వాటి సుగంధం నాసికానికి సంతోషాన్నిస్తుంది. ఏనాడు మొదలైందో గాని ఈనాడు పర్ఫ్యూమ్స్ తయారీ కొన్ని వేల కోట్ల వ్యాపారంగా మారింది. ఎందరికో ఉపాధి కల్పిస్తూ... మరెందరో అందమైన అనుభూతులను మిగులుస్తున్న సెంట్ల వ్యాపారం గురించి, దానిలో వస్తున్న మార్పులు, ట్రెండ్స్ గురించి వివరించిన ఈ కథనం 'సెంట్ పర్సెంట్' గుబాళించింది.

**- ఎల్. ప్రఫుల్లచంద్ర**, ధర్మవరం

### కన్నీటి దాహం!

ఈ వారం కథ 'దాహం' చాలా బాగుంది. ప్రపంచీకరణ, పారిశ్రామీకరణ, నగరీకరణ, అభివృద్ధి.. పేరు ఏదైనా రైతుకే అన్యాయం జరుగుతోంది. కోట్లు కూడగట్టుకునే కోటీశ్వరుల ఇంటి ఇటుకను కూడా కదల్చలేని ప్రభుత్వం, అందరికీ అన్నం పెట్టే రైతు దగ్గరి నుంచి మాత్రం వేలాది ఎకరాలను లాక్కుంటూ కన్నీరు పెట్టిస్తోంది. రైతుకు జరుగుతున్న అన్యాయాన్ని మనుషుల మధ్య ఉండే అనుబంధాలతో అల్లి చాలా చక్కగా వివరించారు రచయిత్రి వనజ తాతినేని. తినడానికి బుక్కెడు కూడు లేని నాడు కోట్లు విలువచేసే గూడు ఉండి మాత్రం ఏం లాభం.. రైతు లేని రాజ్యంలో ఎన్ని పరిశ్రమలు పెట్టి మాత్రం ఏం ప్రయోజనం? అభివృద్ధి అంటే పది అంతస్థుల అద్దాల ఆఫీసులు కట్టడం అని అనుకోబట్టే నేడు ఈ పరిస్థితి ఏర్పడింది. ఇకనైనా పాలకుల ఆలోచనల్లో మార్పు వస్తే బాగుండు!

**- దీపిక**, కాకినాడ

•••

ఈ వారం కథ 'దాహం' చాలా బాగుంది. రాజధాని కోసం భూములిచ్చి తమ జీవనాధారం కోల్పోయిన రైతుల ఆత్మను ప్రతిబింబించేలా కథను మలిచారు రచయిత్రి. "వైద్యం వల్ల ప్రయోజనం ఉండదని తెలిసీ లక్షలకి లక్షలు కుమ్మరించడం కూడా ఒక విధమైన మొహమాటమే" అనే వాక్యం నాకెంతో నచ్చింది. క్యాన్సర్ బారినపడ్డ వారు బతకరని తెలిసి కూడా ఎంతైనా ఖర్చు చేయడానికి వెనుకాడం. ఆడవారి అసూయలు, అనుబంధాలు.. అన్నింటినీ కథలో చక్కగా ఇమిడ్చారు రచయిత్రి.

**- సురేష్**, మన్ననూరు

### అందాల అడ్వెంచర్!

ఈ వారం ట్రావెలోకంలో ఇచ్చిన 'కోస్టారికా' అందాలు అబ్బురపరిచాయి. విమానం ఎక్కి వెంటనే అక్కడికి వెళ్లి చూడాలనిపించింది. అది ఆచరణలో సాధ్యం కాకపోయినా ఊహల్లో ఆ అందాలను ఆస్వాదించి ఆనందించాం. అందమైన బీచ్‌లు, రెయిన్ ఫారెస్టులు ఉన్న దేశం 'వరల్డ్స్ హ్యాపీయెస్ట్ నేషన్'గా గుర్తింపు పొందడంలో ఆశ్చర్యం ఏమీలేదు. అయితే బీచ్‌లలో రెస్టారెంట్లు, హోటళ్లు పెరగడం వల్ల తాబేళ్ల రాక తగ్గిపోయిందని తెలిసి బాధపడ్డాం.

**- కె. సత్య**, హైదరాబాద్

### పవర్‌ఫుల్ 'సిరా' చుక్క

ఈ వారం 'నా పాట'లో సిరాశ్రీ అనుభవాలు ఆసక్తికరంగా చదివించాయి. 'ధర్మరాజు ఓడాడని జూదం చెడ్డదా?' పాటలోని పదాలు అద్భుతంగా అనిపించాయి. పురాణాలను, ఇతిహాసాలను ఒక కోణంలో మాత్రమే చూడడానికి అలవాటైన వాళ్లం మనం. మనకు తెలియని, ఎన్నడూ గుర్తించడానికి ఇష్టపడని రెండో కోణం కూడా వాటికి ఉంటుందని ఈ పాటలో చాలా బాగా వివరించారాయన.

**- లలిత**, విజయనగరం

### 'ట్రూ లెజెండ్స్!'

'మంచునీటి భగీరథులు' కథనం మాకెంతో నచ్చింది. వర్షాలు లేక వ్యవసాయాన్ని వదిలేస్తున్నవారి కష్టాలను తీర్చి వారికి ఆరాధ్యుడైన చెవాంగ్ నిజంగా ఆదర్శనీయుడు. అతనిని ఆదర్శంగా తీసుకుని ఐస్ స్థూపాలు స్థాపించిన వాంగ్‌చుక్ గురించి తెలుసుకుని ఆశ్చర్యపోయాం. 'త్రీ ఇడియట్స్' సినిమాలో అమీర్ పాత్రకే ప్రేరణగా నిలిచిన వాంగ్‌చుక్ భవిష్యత్‌లో ఒక లెజెండరీ పర్సన్‌గా, దేశానికే గర్వకారణంగా నిలుస్తారనడంలో సందేహం లేదు.

**- పరమేశం**, పాలకొల్లు; **టి. సత్యనారాయణ**, వైజాగ్

'ఆదివారం అనుబంధం'పై మీ అభిప్రాయాలను శుక్రవారంలోగా అందేలా పంపగలరు. ఆలస్యంగా అందిన ఉత్తరాలు ప్రచురించడం సాధ్యపడదని మనవి. sunday.aj@gmail.com కి మీ ఉత్తరాల్ని మెయిల్ చేయవచ్చు.





# మొసళ్లతో ఆడుకుంటుంది

మొసలి దగ్గరికి వెళ్లాలంటే వణికిపోతారెవరైనా. కానీ టెక్సాస్‌కు చెందిన క్రిస్టీ క్రోబోత్ మాత్రం మొసళ్లతో ఓ ఆట ఆడుకుంటుంది. ఆ రాష్ట్రంలో జనావాసాల్లోగానీ, పొలాల్లో గానీ మొసలి కనిపించిందంటే వెంటనే క్రిస్టీకి ఫోన్ చేస్తారు. ఆమె ఒక్కసారిగా మొసలిపైకి దూకి తెలివిగా టేపుతో దాని నోరు కట్టేస్తుంది. ఈ ప్రక్రియ చూసేవారికి చెమటలు పట్టించినా, క్రిస్టీ మాత్రం జంకు లేకుండా ఒకచేత్తో మొసలి పైదవడ పట్టుకుని, మరో చేత్తో తనతో పాటు తెచ్చుకున్న టేప్‌ను చకచకా దాని నోటికి వేసేస్తుంది ( ఆ తర్వాత ఆ ప్లాస్టర్ తీసేసి దాన్ని క్షేమంగా నీటిలో వదిలేస్తుంది). “నా చిన్నతనంలో కారులో వెళ్తున్నప్పుడు రోడ్డుకు అడ్డంగా తాబేళ్లు, బాతులు, కుక్కలు, పిల్లులు ఏవి కనిపించినా మా అమ్మ వెంటనే కారు దిగి వాటిని చేత్తో పట్టుకుని రోడ్డు పక్కన పొలాల్లోకి వదిలేసేది. అప్పటి నుంచే నాకు జంతువులంటే భయం పోయింది” అని చెప్పింది క్రిస్టీ. సుమారు నాలుగు మీటర్ల పొడవు 408 కిలోల బరువున్న ఒక ప్రమాదకర మొసలి నోటికి ప్లాస్టర్ వేయడం ద్వారా ఇటీవల ఆమె మరోసారి వార్తల్లోకి ఎక్కింది.

అవీ ఇవీ

# సెకన్లలో నేలమట్టం

లక్షా యాభై వేల చదరపు మీటర్లలో విస్తరించి ఉన్న 19 భవనాలివి. చైనాలోని హుబీ ప్రాంతంలోని వుహాన్ సెంటర్‌ను ఆనుకున్న ఉన్న ఈ భవనాలను రోడ్డు వెడల్పు కార్యక్రమంలో భాగంగా తొలగించాలనుకున్నారు అధికారులు. అయితే ఓ వైపు ఇళ్లు, మరోవైపు సబ్‌వే, అండర్‌గ్రౌండ్ పైప్‌లైన్స్ ఉన్నాయి. వాటిని ఏ మాత్రం డిస్టర్బ్ చేయకుండా 19 భవనాలనూ ఒకేసారి నేలమట్టం చేయాలి. వుహాన్ ఎయిర్‌పోర్ట్ డెవలప్‌మెంట్ గ్రూప్ అందుకు పథకరచన చేసింది. అనేక ప్లాన్‌లు వేసిన అనంతరం చివరికి సుమారు 5 మెట్రిక్ టన్నుల పేలుడు పదార్థాలను ఉపయోగించి కొన్ని సెకన్లలోనే వాటిని విజయవంతంగా నేలకూల్చారు. ఇప్పుడక్కడ ఆ భవనాల జాడే లేదు. ఈ పనిని వారు రాత్రిపూట చేయడంతో ఉదయం ఆ ప్రాంతాన్ని చూసినవారంతా ముక్కున వేలేసుకున్నారు.










గుడికెళ్ళి ప్రాంగణంలో అన్ని దేవుళ్ళకీ మొక్కడం లేదా?! అలాగే ఇక్కడ కూడా అందర్నీ కలవాల్సిందే!

## తస్మాత్ జాగ్రత్త!

'అకారణంగా ఒక వ్యక్తి నీపై అతి ప్రేమ చూపుతున్నాడంటే అతడు నిన్ను ఇప్పటికే మోసం చేసి ఉండాలి. లేదా, మోసం చేయడానికి ప్రయత్నిస్తూ ఉండాలి'.

## కిసుక్కు!



"ఏమిటంత సుదీర్ఘంగా ఆలోచిస్తున్నావు?"
"కాలాన్ని వృధా చేయకుండా ఉండడం ఎలా అని!"

## ఔరా!

ఈ రోజుల్లో కష్టమైన పని?
**- అందమైన అమ్మాయిని పడేయటం!**

అంతకంటే కష్టమైన పని?
**- ఆ అమ్మాయిని మరొకడు పడేయకుండా కాపాడుకోవటం!**

## క్యా డైలాగ్ హై



● "ప్రేమించిన మనిషిని వదులుకోవడమంటే .. ప్రేమను వదులుకోవడం కాదు."

● "అమ్మాయిల్ని ఇంప్రెస్ చేస్తే పడరు. వాళ్ళు ఇంప్రెస్ అయితేనే పడతారు."

చిత్రం : **శతమానంభవతి**



● "ఎదుటోడ్ని బట్టి మన క్యారెక్టర్ ఉండాలి కాని, మనకు మనం ఒక క్యారెక్టర్ ఫిక్స్ అయితే బతకలేం .."

చిత్రం : **శౌర్య**

## పేరడీ

### ('మూగమనసులు' చిత్రంలోని 'పాడుతా తీయగా చల్లగా ..' పాటకు)

**చ**దువుతా ... బుద్ధిగా ... శ్రద్ధగా ...
ప్రతి పాఠమూ మనసు పెట్టి చదువుతా ..
బంగారు కొండలా ... /చదువుతా/

మనసు పెడితే చదువంతా ఒంటపడతది
ఒంటపడ్డ ప్రతి పాఠము గుర్తుకొస్తది



ఇలలో మనకు మిగిలిపోవు చదువె చివరకు
ఆ చదువు కూడ దోచుకునే దొరలు ఎవ్వరూ ... /చదువుతా/

గురువులను గౌరవించు విద్యార్థులే విద్యార్థులు
ఏ లోటూ రాదయ్యా నీ ప్రతిభకు
చదివినోళ్లు అయ్యారు గొప్పోళ్లు
చదివినోళ్ల చదవనోళ్ల తీపి గురుతులు /చదువుతా/

బడికిపోతె మాత్రమే లైఫ్ ఉంటదీ
లైఫ్‌తోటి నీ టార్గెట్ దగ్గరవుతదీ
చావు పుటక లేనిదయ్యా విద్య అన్నదీ
బతుకుతెరువు కది మరి తోడు ఉంటది /చదువుతా/

**- వి. నారాయణభట్**, 77992 51827



‘ఉప్పెనంత ఈ ప్రేమకి గుప్పెడంత గుండె ఏమిటో’ (‘ఆర్య 2’) అనే పాటతో గీత రచయితగా టాలీవుడ్‌లో తనకంటూ ఓ స్థానం సంపాదించుకున్నారు **బాలాజి.** నిజంగానే పాటపై ఆయన ప్రేమ ఉప్పెనంత పెద్దది. గుప్పెడంత గుండెలోనే విస్ఫోటించేంత శక్తిమంతమైనది. ‘నా ఇష్టం’ సినిమాకు రాసిన ‘ఓ సాథియా’, ‘సోగ్గాడే చిన్నినాయన’ సినిమాకు రాసిన ‘నీ నవ్వే హాయిగా ఉంది’ పాటల ముచ్చట్లతో ఈ వారం ఆయనే ‘నా పాట’లో మనముందుకొచ్చారు.

# నీ నవ్వే హాయిగా ఉంది...

నా పాట...39

నా పాటలన్నీ చాలా సరళమైన పదాలతో సాగిపోతుంటాయి. ఆ మాటకొస్తే నా పాటలనే కాదు... తెలుగు సినిమా పాటలన్నీ అలాగే ఉంటున్నాయి. ప్రస్తుతం వాడుకలో పన్నెండు, పదమూడువేల పదాలు ఉన్నాయనుకుంటే వాటికి పర్యాయ పదాలు పెట్టుకుని పాట రాయడమే జరుగుతున్నది. గ్రాంధిక పదాలు రాసే అవకాశం ప్రస్తుత పాటల్లో లేదు. ఒకవేళ ఎప్పుడైనా ఉత్సాహపడి ఒక గంభీరమైన పదం వాడినా కొంచెం తేలిగ్గా రాయండి అని దర్శకులే చెబుతారు. అందుకే సినిమా పాట రాయడానికి పెద్దగా పాండిత్యం అక్కర్లేదు. కానీ సాహిత్యం తెలుసుండటం మాత్రం అవసరం.

గీత రచయిత ఎప్పుడూ మంచి సందర్భం కోసం ఎదురు చూస్తాడు. ఆ సందర్భం మంచి సాహిత్యం కోసం డిమాండ్ చేసేట్టు ఉండాలి. అలాంటి సందర్భం వచ్చిన ప్రతిసారీ నేను ‘నాది’ అని చెప్పుకోగలిగే పాటలిచ్చాను. అలాంటి వాటిలో నా మనసుకు బాగా దగ్గరైన పాట ‘నా ఇష్టం’ సినిమాలో ‘ఓ సాథియా’ పాట. ఇది ఓ ప్రేమికుడు పాడుకునే పాట. ప్రేమ పాటలో ప్రత్యేకత ఏముంటుంది? అని మీరు అనుకోవచ్చు. కానీ నా దృష్టిలో ఉంది. ఈ సినిమాలో కథానాయకుడు స్వార్థం తప్ప మరేమీ పట్టనివాడు. ఎలాంటి సున్నితభావాలకూ లోను కానివాడు. అలాంటి వాడి కఠిన హృదయం కరిగి ప్రేమ మొలకెత్తింది. అదే సమయంలో కథానాయిక వేరే వ్యక్తిని పెళ్లి చేసుకోవాలనుకుంటుంది. అందుకే కథానాయకుడు పాడే పాటలో ఆ తీవ్రత కనిపించాలి. కానీ అంత తీవ్రతలోనూ సున్నితత్వం మిస్ కాకూడదు. అలా డైరెక్టర్ ప్రకాష్ తోలేటి మంచి సందర్భం చెప్పి చక్కటి పాట రాసేందుకు నన్ను మానసికంగా సమాయత్తం చేస్తే... మ్యూజిక్ డైరెక్టర్ చక్రి అద్భుతమైన ట్యూన్ ఇచ్చి నన్ను పోటీ పడమన్నారు. ‘ఓ సాథియా ఓ సాథియా... ఓ చూపుకే పడిపోయా’ అని పాటను మామూలుగానే మొదలుపెట్టాను. మొదటి చరణంలో



ప్రకాష్ తోలేటి



చక్రి

**నీ శకునం కోసం చూసే ప్రతి సెకనుకు నిమిషాలెన్నో**

**నీ హృదయం కోసం వేసే ప్రతి అడుగున దూరాలెన్నో**

అని రాసి కథానాయకుడి ఆవేదనకు రూపమిచ్చాను. రెండో చరణంలోనూ ఇలాంటి బరువైన భావాలు ఉన్నాయి. ఇక్కడ మీకో విషయం చెప్పాలి. ఒకరోజు రెండో చరణం సగం రాసి ఇంటికి వెళ్లిపోతూ ‘తనతానన తాననానాన తనతానన తాననానాన’ ఇలా తత్‌కారం అనుకుంటున్నాను. అప్పుడు ‘నా గుండెల చప్పుడు కన్నా నీ అలికిడితో బతికున్నా’ అని లైను వచ్చింది. వెంటనే డైరెక్టర్ ప్రకాష్‌గారికి ఫోన్ చేసి చెప్పాను. ‘చాలా బాగుంది. వెంటనే పేపరుపై పెట్టండి’ అన్నారు. ఆ తర్వాత -

**‘వెంటపడే నీడని అచ్చమైన నువ్వని**

**వేలుపట్టి లోకమే దాటనా’**

అని రాశాను. అంటే ‘నా వెనుక వచ్చేది కూడా నా నీడ అనే గ్రహించే స్థితిలో లేను, ఆ నీడ కూడా నువ్వే అనుకుంటాను, నువ్వనే ఆ నీడ వేలు పట్టుకునే మరణిస్తాను’ అనే అర్థం స్ఫురించేలా రాసేసరికి పాటకో అందం వచ్చింది. నాలుగురోజుల్లో పాట పూర్తయింది. సినిమా కంటే కూడా పాట బాగా పాపులర్ అయింది. ఆడియో రిలీజైన తర్వాత పాట బాగుందని చాలామంది ఫీడ్‌బ్యాక్ ఇచ్చారు. అయితే ఇవన్నీ ఒకెత్తు... సిరివెన్నెలగారు ఇచ్చిన కాంప్లిమెంటు ఒక్కటీ ఒకెత్తు. ఒకసారి ఆయన దగ్గర ఈ పాట పాడినప్పుడు ‘నా మనసంతా చెరిపి నీ రూపం గీశావే... నీ బరువే మోపి నను తేలిక చేశావె’ అనే లైన్ల గురించి అక్కడే ఉన్న కృష్ణవంశీ, క్రిష్‌లతో ప్రస్తావిస్తూ “బాలాజీ మంచి ఎక్స్‌ప్రెషన్ రాశాడు” అన్నారు. డైరెక్టర్ ప్రకాష్ కూడా ఈ లైన్ల గురించి మాట్లాడుతూ “మీ ఎక్స్‌ప్రెషన్‌కు పిక్చరైజేషన్‌లో నేను న్యాయం చేయలేకపోయాననిపించింది బాలాజీ గారు” అన్నారు. అది కూడా మంచి కాంప్లిమెంట్‌గానే భావిస్తాను.




ఇక ‘సోగ్గాడే చిన్నినాయనా’ సినిమా పాట గురించి. పాట రాసే అవకాశం ఇవ్వమని నేనే డైరెక్టర్ కళ్యాణ్ కృష్ణగారిని అడిగాను. ఆయన తప్పకుండా అవకాశమిస్తానని చెప్పి ఓ రోజు రాత్రి ఎనిమిది గంటలకు ఫోన్ చేసి “మీరు వెంటనే మ్యూజిక్ డైరెక్టర్ అనూప్ రూబెన్స్‌గారిని కలవండి. ఆయన మీకు ట్యూన్ ఇస్తారు.

అక్కడే కూర్చుని రాసి, నాకు ఫోన్‌లో వినిపించండి" అన్నారు. సరేనని నేను అనూప్‌గారికి దగ్గరకు వెళ్లాను. అప్పటికప్పుడే ఆయన గిటార్‌పై ఓ ట్యూన్ వినిపించారు. పావుగంటలో పాట రాసి కళ్యాణ్ కృష్ణగారికి ఫోన్ చేశాను. ఆయన నచ్చలేదన్నారు. అలా మూడుసార్లు జరిగింది. తర్వాత అనూప్‌గారు తాను ఎప్పుడో చేసి పెట్టుకున్న ట్యూన్ ఒకటి వినిపించారు. ఆ ట్యూన్ డైరెక్టర్‌కి బాగా నచ్చి, దానికే లిరిక్స్ రాయండి అన్నారు. అదే 'నీ నవ్వే హాయిగా ఉంది' పాట. అప్పటికే రాత్రి పన్నెండు అయింది. దానికి నేను రాసిన లిరిక్స్ చూసి బాగానే ఉన్నాయి కానీ రేపు మళ్లీ కూర్చుందాం అన్నారు డైరెక్టర్. ఆ మర్నాడు రాత్రి ఏడుగంటలకు మళ్లీ మ్యూజిక్ సిట్టింగ్స్‌లో కూర్చున్నాం. ఈ పాట కోసం డైరెక్టర్‌గారు నాకు మొత్తం కథ టూకీగా చెప్పారు. మనసులో ప్రేమున్నా అది ఎలా వ్యక్తం చేయాలో తెలియని భర్త... పని తప్ప మరో ఊసులేని భర్తతో విసిగి ఆమె విడాకులు తీసుకునే భార్య... అలాంటి స్థితిలో భర్త తన ధోరణి నుంచి బయటకు వస్తాడు. భార్యతో చిలిపిగా ప్రవర్తించడం, ఆమె మనసుకు నచ్చినట్టు నడుచుకోవడం చేస్తాడు. దానికి ఆమె స్పందన ఎలా ఉంటుందనేది పాట


కళ్యాణ్ కృష్ణ




సందర్భం. దీన్ని పాటలో పెట్టాలి. రాత్రి పదిగంటలయ్యేటప్పటికి మూడు నాలుగు వెర్షన్స్ రాశాను. అందులో మొదట ఒక వెర్షన్ ఓకే అయింది. కాని రాత్రి పన్నెండు గంటలకు కళ్యాణ్ కృష్ణగారు మళ్లీ ఫోన్ చేసి "బాలాజీగారు నేను పాట పదిసార్లు విన్నాను. అంతా బావుంది కానీ పల్లవి వేరేది వస్తే బావుంటుందేమో, మళ్లీ మార్చి రాయగలరా" అని అడిగారు. అప్పటికప్పుడే మళ్లీ పల్లవి కోసం కొన్ని లైన్లు అనుకుని వాట్సాప్ చేయడం, ఆయన బాగాలేదనడం, మళ్లీ రాయడం... ఇది రాత్రి మూడు గంటల వరకూ సాగింది. చివరిగా-


అనూప్ రూబెన్స్

**నీ నవ్వే హాయిగా ఉంది**
**ఈ ఊసే కొత్తగా ఉంది**
**ఇన్నాళ్లూ ఇంత మాయ ఏమైపోయింది**

..............................................................

ఇలా ఎనిమిదిలైన్ల పల్లవి రాసి పంపించాను. అది చాలా బావుందని చివరికి దాన్ని ఓకే చేశారు. శ్రేయా ఘోషాల్ ఉత్తరాది గాయని అయినా భావాన్ని చక్కగా అర్థం చేసుకుని పాడారు. ముఖ్యంగా 'ఏంటండీ సారూ... మీరేనా ఆ మీరు' అనే లైనులో శ్రోతలకు అర్థమయ్యేట్టుగా గొంతులో భావాన్ని పలికించారు. మా అందరి శ్రమ ఫలించి సినిమాలో ఆ పాట పెద్ద హిట్టయ్యింది.


శ్రేయా ఘోషాల్

**బాలాజీ** – 9676445314

– రాజేశ్వరి



కవర్ స్టోరీ

# ఆర్గానిక్ బాటసారులు

వ్యవ'సాయం' లేక రైతులు కునారిల్లుతున్న వేళ... పెట్టుబడులు పెరిగి, దిగుబడులు, ధరలు తగ్గి రైతులు డీలా పడుతున్న వేళ...

ఒకవైపు వ్యవసాయం పండగలా కాకుండా దండగలా మారుతోందని ఇంతకాలం భూమినే నమ్ముకున్న రైతన్నలు వలసలు పోతుంటే... మరోవైపు అదే నేలను నమ్ముకుని 'సేంద్రియ' సేద్యం చేస్తూ కొంతమంది అభ్యుదయ రైతులు సరికొత్త ఆశల విత్తనాలు చల్లుతున్నారు. లాభాల పంటలు పండిస్తున్నారు. తమ పద్ధతుల గురించి, ఆ ఫలితాల గురించి విస్తృతంగా ప్రచారం చేస్తూ అనేకమంది రైతుల్లో స్ఫూర్తిని, ఆత్మవిశ్వాసాన్ని నింపుతున్నారు. తిరిగి వారిని వ్యవసాయం వైపు అడుగులు వేసేలా ప్రోత్సహిస్తున్నారు. రైతుల ఆత్మహత్యలను ఆపేందుకు వీరి విజయగాథలు ఏమైనా ఉపయోగ పడతాయన్న ఆశతో... వారిలో కొందరి అనుభవాలు వారి మాటల్లోనే...



1 తిప్పావఝ్ఝుల కుమార్

## ఒక్క ఆవుతో 20 ఎకరాల్లో సేద్యం

వ్యవసాయంతో పాటు సమాజాన్ని కాపాడుకోవాలంటే కూడా సహజ సేద్యమే ఏకైక మార్గం. 15 ఏళ్ల క్రితం రంగారెడ్డి జిల్లా కమ్మెట గ్రామంలో 20 ఎకరాల భూమిని కొనుగోలు చేశాం. నా భర్త నర్సారెడ్డితో కలిసి దాన్ని వ్యవసాయ క్షేత్రంగా మార్చుకున్నాను. జీవవైవిధ్యాన్ని కాపాడితేనే భూమి ఆరోగ్యంగా ఉంటుందని, అప్పుడే మంచి పంటలు పండి ప్రజలకు ఆరోగ్యం చేకూరుతుందని నా నమ్మకం. దాన్నే ఆచరణలో పెట్టాను. ఒక్క దేశీ ఆవుతో 20 నుంచి 30 ఎకరాల్లో తక్కువ ఖర్చుతో సహజ సేద్యం చేయవచ్చు. ప్రకృతి వ్యవసాయంలో ఎప్పటికప్పుడు వస్తున్న మార్పుల్ని గమనిస్తూ తదనుగుణంగా సాంకేతిక పరిజ్ఞానంలో మార్పులు చేసుకుంటూ అధిక దిగుబడులు సాధిస్తున్నాం. ఇప్పుడిప్పుడే ప్రజల్లో సహజ సేద్యంపై అవగాహన పెరుగుతున్నది. వినియోగదారులు నేరుగా మా పొలానికి వచ్చి మేం పండించిన సహజ ఆహారాన్ని కొనుగోలు చేస్తున్నారు. తద్వారా వారితో పాటు మేమూ లాభం పొందుతున్నాం.



ప్రకృతి సిద్ధంగా పండిన ఆహార ఉత్పత్తులు తెచ్చుకునేందుకు ప్రజలు పొలాలకు వెళ్లే సంప్రదాయం రావాలి. అలా చేసినపుడే క్రిమిసంహారకాలు చల్లి పండించిన పంటల్ని తిని ఆస్పత్రుల చుట్టూ తిరిగే కష్టం తప్పుతుంది. ప్రతి ఆదివారం ఎంతో మంది ఔత్సాహిక రైతులు మా క్షేత్రానికి వచ్చి ప్రకృతి సాగులో మెళకువలు నేర్చుకుంటున్నారు. విద్యార్థులకు, ఔత్సాహికులకు కలిపి వర్క్‌షాప్‌లు నిర్వహిస్తున్నాం. నిజమైన రైతుకు శిక్షణ అవసరం లేదు. ఒక్కసారి చూస్తే ఇట్టే గ్రహిస్తారు. మేం సహజ సేద్యం ప్రారంభించాక మా చుట్టుపక్కల రైతులు కూడా చాలామంది రసాయనాలు వాడకుండా సేంద్రియ విధానంలో పంటలు పండిస్తున్నారు. రైతులు తమ భూములను దశల వారీగా అయినా మళ్లీ ప్రకృతి వ్యవసాయ క్షేత్రాలుగా మార్చుకుంటే ముందు తరాలవారికి మంచి ఆహారం లభించే అవకాశం ఉంది.

**- శ్రీమతి శారద,** కమ్మేట, రంగారెడ్డి జిల్లా, 98480 25089

## సేంద్రియ స్ఫూర్తి

**నే**ను చాలాకాలం రసాయన ఎరువులతో సాగు చేసి చివరికి 2008 నుంచి ఆరు ఎకరాల్లో ఆ పద్ధతికి స్వస్తి చెప్పి గో ఆధారిత వ్యవసాయం ప్రారంభించాను. ప్రస్తుతం ఎకరాకు రెండు టన్నుల వరి పండిస్తున్నాను. ఈ తొమ్మిదేళ్లలో నేను గమనించింది ఏమిటంటే రసాయనాలు విపరీతంగా వినియోగిస్తున్న రైతుల పొలాల్లో సారం తగ్గిపోతుంటే నా పొలంలో సారం పెరుగుతోంది. ఉదాహరణకు ఆ పొలాల్లో కర్బనశాతం 0.40 ఉంటే, నా పొలాల్లో అది 0.65కి పెరిగింది. వారితో పోల్చుకుంటే నాకు ఖర్చు కూడా తక్కువే ఉంటోంది. రసాయనాల బదులుగా వేపపొడిని వాడటం వల్ల క్రిమికీటకాల బారి నుంచి పంటను కాపాడుకోగలుగుతున్నాను. నెల్లూరులో నేను పండించిన గో ఆధారిత ఉత్పత్తులను అమ్మేందుకు ఒక స్టాల్ కూడా ఏర్పాటు చేశాను. అక్కడికి వచ్చి చాలామంది కొనుగోలు చేస్తుంటారు. ఒకవైపు వ్యవసాయం చేసుకుంటూనే మరోవైపు ఔత్సాహిక రైతులకు శిక్షణా తరగతులు నిర్వహిస్తున్నాను. వ్యవసాయ సీజన్ ప్రారంభానికి ముందు మెళకువలు చెప్పేందుకు ఒక సెమినార్‌ను,




సీజన్ ముగిశాక పండించిన పంటకు మార్కెట్ కల్పించేందుకు ఒక ఎగ్జిబిషన్‌ను ఏటా ఏర్పాటు చేస్తున్నాం. మహిళల్లో చిరుధాన్యాలు, సేంద్రియ ఉత్పత్తుల పట్ల అవగాహన పెంచేందుకు ఏప్రిల్ చివరివారంలో మరో సెమినార్ ఏర్పాటు చేస్తున్నాను. ప్రజలు ఆర్గానిక్ ఉత్పత్తులను ఆదరించినప్పుడే రైతులు ఉత్సాహంగా ఆ పంటలు పండిస్తారు. ముందుతరాలకు సారవంతమైన భూమిని అందించడంతో పాటు, సమాజం ఆరోగ్యంగా ఉండాలంటే ప్రకృతి వ్యవసాయం ఒక్కటే శరణ్యం. ఈ దిశగా రైతుల్లో అవగాహన పెంచేందుకు పదేళ్లుగా పనిచేస్తున్నాను. మొక్కుబడిగా కాకుండా చిన్నరైతు సంక్షేమం లక్ష్యంగా ప్రభుత్వం కూడా ప్రకృతి సేద్యాన్ని ప్రోత్సహించాలి.

**- పోలిశెట్టి రామ్మోహన్ రెడ్డి,** ప్రకృతి వ్యవసాయదారుల సంఘం రాష్ట్ర కార్యదర్శి, పెనుపల్లి నెల్లూరు జిల్లా, 98667 60498

## ఆక్వా వ్యవసాయం...

**మ**హబూబ్‌నగర్ జిల్లా గుండేడులో 17 ఏళ్ల క్రితం 8 ఎకరాల భూమి కొన్నాను. వరి, ద్రాక్ష సాగు చేసి నష్టపోయాను. అప్పుడే మూసపద్ధతి వద్దనుకున్నాను. ద్రాక్ష తోటకు వేసిన పందిళ్లను ఉపయోగించుకుని తీగ జాతి కూరగాయలు వేశాను. టమాటా సాగులో ప్రతి మొక్కకు గుడిసె ఆకారంలో పందిరి వేసి మిగిలిన వారికంటే నాలుగు రెట్ల అధిక దిగుబడి సాధించాను. ఆ స్ఫూర్తితో



## దేశీ విత్తన రక్షకుడు

**మ**నం పండించే విత్తనం మనది కాదు. మనం వాడుతున్న సాగు పద్ధతులు మనవి కావు. మరి మనవి కాని పద్ధతుల్లో పండించిన ఆహారం తిని ప్రజలు మాత్రం ఆరోగ్యంగా ఎలా ఉంటారు? తెలుగు రాష్ట్రాల్లోనే ఏటా వేలాది మంది రైతులు ఎందుకు ఆత్మహత్యలు చేసుకుంటున్నారని ఆలోచించినపుడు రైతులు దేశీ విత్తనాలకు, సంప్రదాయ సాగు పద్ధతులకు దూరం కావడమే ఈ అనర్థాలకు మూలం అని గ్రహించాను. దేశమంతా తిరుగుతూ దేశీ విత్తనాలు సేకరించడం మొదలుపెట్టాను. ఇప్పటివరకు 250కి పైగా దేశీ వరి వంగడాలు సేకరించాను. అలా సేకరించిన వంగడాలను వికారాబాద్ సమీపంలో ఉన్న వ్యవసాయ క్షేత్రంలో సాగుచేసి, ఆ విత్తనాలను ఐదేళ్లుగా రైతులకు ఉచితంగా పంచుతున్నాను. 2015లో కరీంనగర్‌లో, గత ఏడాది హైదరాబాద్ రామకృష్ణా మఠంలో నిర్వహించిన దేశీ విత్తనాల ఉచిత పంపిణీ కార్యక్రమాలకు వేలాది మంది రైతులు వచ్చి విత్తనాలు తీసికెళ్లారు. తెలంగాణలో పూర్వం 25 రకాల ఆకుకూరలు ఉండేవి. ఇప్పుడు అవి 6 లేక 7కు పరిమితం అయ్యాయి. మనం తింటున్న కూరగాయలన్నీ హైబ్రీడ్‌వే. అందుకే త్వరలో నిర్వహించనున్న విత్తన పంపిణీ శిబిరంలో రైతులకు వరితో పాటు దేశీ కూరగాయల విత్తనాలు కూడా అందించే ప్రయత్నంలో ఉన్నాను. దేశీ విత్తనాల్లో అద్భుతమైన పోషకవిలువలు ఉన్నట్లు జాతీయపోషకాహార సంస్థ పరీక్షల్లో నిర్ధారణ అయింది. నా దగ్గర నుంచి తీసుకువెళ్లిన విత్తనాలను రైతులు పొలాలలో సాగుచేసి, ఆ పంటల నుంచి వచ్చిన గింజలను ఇతర రైతులకు పంచుతున్నారు. దేశీ విత్తనాల గురించి ప్రచారం చేయడంతో పాటు పాలేకర్ స్ఫూర్తితో ప్రకృతి సేద్యం కూడా చేస్తున్నాను. గ్రామంలో ప్రతి రైతు దగ్గర ఒక ఆవు, ఇంటికో వేపచెట్టు ఉంటే రసాయన ఎరువు అవసరమే లేదు. రైతులు ఏ వస్తువు కోసమూ ఊరు దాటి వెళ్లాల్సిన అవసరం ఉండదు. కృష్ణాజిల్లా తరకటూరులోని నా వ్యవసాయక్షేత్రంలో నేను ఏదైతే చెపుతున్నానో అదే చేసి చూపిస్తున్నాను. తక్కువ నీటితో, తక్కువ ఖర్చుతో చేసే ప్రకృతి సేద్యమే ఎప్పటికైనా చిన్నరైతుకు శ్రీరామరక్ష అవుతుంది.

**- విజయ్‌రామ్,** తరకటూరు, కృష్ణా జిల్లా - 99666 43666

## రైతు నేస్తం



మనకు ఆహారం పండించేందుకు రైతు అహర్నిశలు కష్టపడతాడు. అయినా రైతులకు సమాజంలో తగిన గుర్తింపు లేదు. 2001 నుంచి నాలుగేళ్ల పాటు తెలుగు రాష్ట్రంలో కరువు తాండవించింది. రైతులకు దిక్కుతోచని పరిస్థితి. ఈ పరిణామాలు నాలో ఆలోచన రేకెత్తించాయి. రైతు లోకాన్ని చైతన్యపరచి, వారికి సమాజంలో సముచిత గౌరవం కల్పించేందుకు ఏదైనా చేయాలని సంకల్పించాను. 2005లో 'రైతునేస్తం' పత్రిక ఏర్పాటు చేశాను. తెలుగు రాష్ట్రాల్లో ఉత్తమ రైతులను ఎంపిక చేసి వారికి పురస్కారాలు ఇప్పించడం ప్రారంభించాను. పశునేస్తం, ప్రకృతి నేస్తం తదితర పత్రికల ద్వారా రైతులకు, శాస్త్రవేత్తలకు మధ్య సమాచార వారధిగా నిలిచాను. రైతులకు అవసరమైన సమాచారాన్ని నిపుణుల చేత రాయించి 25 పుస్తకాలు ప్రచురించాను. వ్యవసాయ పద్ధతులు, పశుపోషణపై 8 సమగ్ర డీవీడీలు రూపొందించాను. రసాయనిక ఎరువులతో జరుగుతున్న ఆధునిక వ్యవసాయం భూసారాన్ని దెబ్బతీస్తున్నది. మరీ ముఖ్యంగా గుంటూరు జిల్లా రసాయనిక ఎరువులు, క్రిమి సంహారక మందుల వినియోగానికి కేంద్రంగా మారింది. అందుకే రైతులను సేంద్రియ వ్యవసాయం వైపు మళ్లించే లక్ష్యంతో గత ఏడాది మార్చి నుంచి ప్రతి ఆదివారం ఒక శిక్షణా శిబిరం నిర్వహిస్తున్నాం. ఇతర జిల్లాలకు చెందిన వందలాది మంది రైతులు కూడా మా సేంద్రియ శిక్షణ పట్ల ఆసక్తి చూపుతున్నారు. మొబైల్ వ్యాన్ ద్వారా 72 గ్రామాల్లో ప్రకృతి వ్యవసాయం గురించి ప్రచారం చేస్తున్నాం. కళాకారుల బృందాలతో సేంద్రియ వ్యవసాయ గురించి రైతుల్లో అవగాహన పెంచుతున్నాం. ప్రభుత్వం ప్రకృతి వ్యవసాయం చేసే రైతులకు అదనంగా సబ్సిడీలు ఇవ్వాలి. సేంద్రియ వ్యవసాయానికి ప్రాణమైన ఆవులను ఉచితంగా అందించాలి. ఈ పద్ధతుల్లో రైతు పండించే పంటను ప్రభుత్వమే కొనుగోలు చేయాలి. ఆర్గానిక్ ఉత్పత్తులను ఉపయోగించడం వల్ల కలిగే ప్రయోజనాల గురించి పట్టణ ప్రజల్లో అవగాహన పెంచాలి.

**- వై. వెంకటేశ్వరరావు,** రైతునేస్తం ఫౌండేషన్, గుంటూరు, 94905 59999

దొండ, కాకర, గుమ్మడి, బీర, పొట్ల పంటలు సాగు చేశాను. ప్రతి పంట వేసేటప్పుడు ఏదో ఒక కొత్త సవాలు ఎదురయ్యేది. శాస్త్రవేత్తలు, నిపుణుల సలహాలు తీసుకోవడంతో పాటు సొంతగా ప్రయోగాలు చేశాను. తీగ జాతి కూరగాయల సాగుతో పాటు ఆక్వాఫోనిక్ పద్ధతిలో చేపల పెంపకం ప్రారంభించాను. చేపల ట్యాంకులోని నీటిని మొక్కలకు వెళ్లేలా, మళ్లీ ఆ మొక్కల నీరు చేపల ట్యాంకులోకి వెళ్లేలా చూడటం వల్ల నూరుశాతం సేంద్రియ పద్ధతిలోనే అటు చేపలు, ఇటు పంట పండించగలిగాను. తాజాగా 'రీసర్క్యులేషన్ ఆక్వాకల్చర్' పద్ధతి మొదలుపెట్టాను. చేపల మలమూత్రాలు ట్యాంకులోనే ఉండిపోవడం వల్ల దిగుబడి సరిగా రావడం లేదు. ఆ నీటిని నిరంతరం మార్చడం వల్ల అధిక దిగుబడులు సాధించవచ్చని కనుగొన్నాను. ఈ విధానం ద్వారా పావు ఎకరం భూమిలోనే ఏటా 50 వేల టన్నుల చేపల దిగుబడిని సాధించాలన్న లక్ష్యంతో పనిచేస్తున్నాను. మామూలుగా ఇంత దిగుబడి సాధించాలంటే 20 నుంచి 30 ఎకరాల భూమి, చాలా పెద్ద మొత్తంలో నీరు అవసరం. నాకు తెలిసిన విషయాలను పది మందితో పంచుకునేందుకు వీలుగా ప్రతి నెలా 15వ తేదీని సందర్శకుల రోజుగా పెట్టుకున్నాను. గత నెలలో 400 మంది రైతులు, ఔత్సాహిక వ్యవసాయదారులు నా క్షేత్రాన్ని సందర్శించారు. దాంతో పాటు వర్క్‌షాప్‌లు కూడా నిర్వహిస్తున్నాను. వివిధ రాష్ట్రాల ప్రజలే కాకుండా విదేశీయులు కూడా నేను చేపట్టిన సాగువిధానాలను ఆసక్తిగా అడిగి తెలుసుకుంటున్నారు.

**- విశ్వనాథ రాజు,** గుండేడు, మహబూబ్‌నగర్ జిల్లా, 94404 57221



విశ్వనాథ రాజు

## అనంతలో ఉద్యానవనం

18 ఏళ్ల పాటు రసాయన సేద్యం చేయడం వలన బంగారం లాంటి నా భూమి నిస్సారంగా మారింది. రానురాను దిగుబడులు బాగా తగ్గిపోయాయి. ఆ సమయంలో పాలేకర్ శిక్షణా శిబిరానికి వెళ్లాను. వ్యవసాయం గురించి నేను ఇంతకాలం ఎంత తప్పుగా ఆలోచించానో అప్పుడు అర్థం అయింది. ఆ రోజు నుంచి సేంద్రియ వ్యవసాయం మొదలుపెట్టాను. మాది ఉమ్మడి కుటుంబం. మాకున్న 170 ఎకరాలను దశల వారీగా సేంద్రియ సాగుకు అనుకూలంగా మార్చుకుంటూ వచ్చాం. మొదట సపోటా, మామిడి, బొప్పాయి వంటి పండ్ల తోటల సాగు



ప్రారంభించాం. సేంద్రియ సాగు ప్రారంభించిన మొదటి రెండు సంవత్సరాలు దిగుబడులు అంతగా రావు. భూమి సేంద్రియ సాగుకు అనువుగా మారాక దిగుబడి పెరిగింది. అంతకాలం వేచి చూడటం అందరికీ సాధ్యం కాదు. అందుకే దశల వారిగా పంట భూమిని సేంద్రియానికి అనుకూలంగా మార్చుకోవాలని పాలేకర్ సూచిస్తారు. నేను అదే చేశాను. సేంద్రియ పద్ధతుల్లో సాగు ప్రారంభించాక బొప్పాయి పంట వైరస్‌ను తట్టుకోగలిగింది. సపోటా తోటలో తేమను కాపాడేందుకు తోట మధ్యలో కొర్రలు, సజ్జలు, ఉలవలు, పెసర్లు, మినుములు, కందులు, అలసందలు పండిస్తున్నాను.

అనంతపురంలో తోటలకు అనుకూలమైన వాతావరణం ఉంది కానీ నీటి వసతి లేదు. సేంద్రియ పద్ధతుల్లో ఎంత పంట పండించినా మార్కెటింగ్ సమస్య మమ్మల్ని వెంటాడుతోంది. ఆర్గానిక్ ఉత్పత్తులు విక్రయించే దుకాణాల వాళ్లు కొంత పంట మాత్రమే కొనగలరు. నాణ్యమైన పంటను విదేశాలకు ఎగుమతి చేసే సౌకర్యం కల్పిస్తే పరిస్థితి మెరుగ్గా ఉంటుంది.

ప్రకృతి వ్యవసాయానికి సంబంధించి ఎక్కడ సభలు, సమావేశాలు జరిగినా నేను వాటికి హాజరవుతాను. పెద్ద రైతుగా నా అనుభవాలను సాటి రైతులతో పంచుకుంటాను. నా దగ్గరకు వచ్చే వారందరికీ సేంద్రియసాగు పద్ధతులపై అవగాహన కల్పిస్తూ ఉంటాను. భూమి మీద, ప్రకృతి మీద మమకారం ఉన్న వాళ్లంతా సేంద్రియ సాగు చేసే రోజు ఎంతో దూరంలో లేదని నా నమ్మకం.

**- కూన తిప్పేస్వామి,** మల్లాపురం, అనంతపురం జిల్లా, 94410 74446

## 'తొలకరి' జల్లు

నిజామాబాద్ జిల్లా బోధన్ సమీపంలోని చిన్నగ్రామంలో రైతు కుటుంబంలో పుట్టాను. 22 ఏళ్ల పాటు తెలుగు రాష్ట్రాల్లో వివిధ ప్రజా, కార్మిక ఉద్యమాల్లో పాల్గొన్నాను. ఈ క్రమంలో రైతు సమస్యలను దగ్గరగా చూసే అవకాశం కలిగింది. ఆ తర్వాత సిఎస్ఎ (సుస్థిర వ్యవసాయ కేంద్రం)తో ఆరేళ్లు కలిసి పనిచేశాను. సంక్షోభంలో కూరుకుపోయిన రైతాంగానికి ప్రత్యామ్నాయ మార్గం చూపేందుకు కృషి చేసే సంస్థ ఇది. రసాయన రహిత వ్యవసాయ పద్ధతుల గురించి రైతులకు తెలియజేసేందుకు 'తొలకరి' అని ఒక మాసపత్రికను నడుపుతున్నాం. రైతు ఆత్మహత్యలపై చాలా అధ్యయనం చేశాను. రైతుల జీవన ప్రమాణాలు మెరుగుపడితే తప్ప ఆత్మహత్యల పర్వం ఆగదని గ్రహించాను. సుస్థిర వ్యవసాయ పద్ధతులు పాటించినప్పుడే రైతుల జీవన ప్రమాణాలు మెరుగుపడతాయి. ఆ దిశగా రైతును బలోపేతం చేస్తున్నాం. సహజసిద్ధంగా పండించిన పంటను ఎక్కడ అమ్మాలనే సమస్యకు పరిష్కారంగా తెలుగు రాష్ట్రాల్లో ఉన్న 25 రైతు, వినియోగదారుల సహకార సంఘాలను కలిపి ఒక సంస్థను ఏర్పాటు చేశాం. దానికి సీఈఓగా బాధ్యతలు నిర్వహిస్తున్నాను. ఎరువులు లేకుండా పండించిన పంటను రైతులు మంచి ధరకు అమ్ముకునేందుకు మా సంస్థ అన్ని విధాల తోడ్పడుతుంది. హైదరాబాద్, విశాఖపట్నంతో పాటు 12 కేంద్రాల్లో సహజ ఆహార విక్రయ కేంద్రాలను ఏర్పాటు చేసి పంటను నేరుగా ప్రజలకు విక్రయిస్తున్నాం.



**- కన్నెగంటి రవి,** రైతు స్వరాజ్య వేదిక రాష్ట్ర కమిటీ సభ్యులు, హైదరాబాద్ - 040 - 27017735

## ప్రకృతి వ్యవసాయంతో లాభాల పంట



పూర్వం రైతు భూమిని బంగారంగా భావించేవాడు. ఇప్పటి రైతు అనేక ఎరువులు కుమ్మరించి భూముల్ని పాడుచేసుకుంటున్నాడు. రసాయనాలు, క్రిమిసంహారకాలతో పండించిన పంటలు ఆహారంగా తీసుకుని ప్రజలందరూ అనారోగ్యం 'కొని' తెచ్చుకుంటున్నారు. ప్రకృతి సిద్ధంగా పండించిన ఆహార ఉత్పత్తులు తింటేనే మనం ఆరోగ్యంగా ఉంటాం అనే భావనతో పదేళ్లుగా ప్రకృతి ఆధారిత వ్యవసాయం చేస్తున్నాను. 28 ఎకరాల్లో వరి, చెరకు, అపరాలు (మినుములు, పెసర్లు, బొబ్బర్లు) పండిస్తున్నాను. ఫలితాలు బాగుండటంతో పక్కనున్న పొలాలను కూడా కలుపుకుని సుమారు 60 ఎకరాల్లో సేంద్రియ సాగు చేస్తున్నాం. ఇప్పటి వరకు ఏ సంవత్సరం నష్టం రాలేదు. మా ఉత్పత్తులకు మేమే స్వయంగా మార్కెటింగ్ చేస్తున్నాం కాబట్టి లాభాలు వస్తున్నాయి. మా కస్టమర్లకు ఆరోగ్యకరమైన సేంద్రియ ఉత్పత్తులను అందిస్తున్నామనే సంతృప్తి కూడా ఉంది.

ఒకవైపు వ్యవసాయం చేస్తూనే 'గో ఆధారిత ప్రకృతి వ్యవసాయ దారుల సంఘం, ఆంధ్రప్రదేశ్'ను ఏర్పాటు చేసి ప్రకృతి సేద్యం చేసే వారికి సలహాలు, సూచనలు ఇస్తున్నాం. ప్రకృతి సేద్యం చేసే రైతులకు ఆర్థిక సాయం చేసే లక్ష్యంతో గో ఆధారిత ప్రకృతి వ్యవసాయదారుల పరపతి సంఘం కూడా ఏర్పాటు చేస్తున్నాం. మాలాంటి వారితో పాటు ఇప్పుడు ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం కూడా ప్రకృతి వ్యవసాయాన్ని ప్రోత్సహిస్తున్నది. సేంద్రియ వ్యవసాయాన్ని ఒకటి రెండు పాలిటెక్నిక్ కళాశాలల్లో పాఠ్యాంశంగా పెడుతున్నారు. వ్యవసాయ విద్యార్థులు, రైతులు నా క్షేత్రాన్ని తరచూ సందర్శిస్తూ ఉంటారు. ఔత్సాహిక రైతులకు సేంద్రియ ఎరువుల తయారీ విధానాలతో పాటు ప్రకృతి సాగు పద్ధతులు నేర్పుతున్నాను. సేంద్రియ ఉత్పత్తుల గురించి ప్రజల్లో అవగాహన పెరగడంతో రైతులు కూడా ప్రకృతి సేద్యంపై ఎక్కువగా దృష్టి సారిస్తున్నారు. 7, 8 సంవత్సరాల్లో ప్రకృతి సేద్యం పెను ఉద్యమంగా మారుతుందని నా విశ్వాసం.

**- భూపతిరాజు రామకృష్ణంరాజు,** ఉంగుటూరు, పశ్చిమగోదావరి జిల్లా, 94404 87864

# నా ఇష్టం

Raju




చచ్చినోళ్లు... పాతిపెట్టకుండా
వదిలేసి పోయారు చూడు !!


ఏమండోయ్... సోషల్ మీడియాలో
హిందూ దేవతల మీద తీవ్రమైన
వ్యాఖ్యలేమైనా చేశారా ?


మావారు నన్ను తిట్టిన తిట్లన్నీ బుక్
రాసుకొచ్చా పబ్లిష్ చేస్తారా సార్ ?!
పబ్లిషర్


ఇప్పుడు వంట చేసే ఓపిక లేదు.
కిట్టీ పార్టీలో మిగిలిపోయిన
సమోసాలో, బర్గర్లో ఉండే
ఉంటాయి తిని పడుకోండి !!


ఏమండోయ్... మీ బాస్ నుండి ఫోన్ !
మీ నాయనమ్మ దహన సంస్కారాలు వాట్సాప్‌లో
లైవ్ చూపించమంటున్నారు!!

# హెపటైటిస్ వైరస్ హోమియోతో మాయం

**నా పేరు** ప్రభాకర్. నా వయస్సు 35 సంవత్సరాలు. ఆరు నెలల క్రితం నేను చావు అంచుల వరకు వెళ్లొచ్చాను. ఏం జరిగిందంటే.... నీరసంగా ఉండేది. ఆకలిగా అనిపించినా తినాలని అనిపించకపోయేది. తింటే వాంతులు అయ్యేవి. కొన్ని రోజులకు కడుపు నొప్పి కూడా మొదలయింది. ఊర్లో తెలిసిన డాక్టర్‌కు చూపిస్తే ఏవో మందులు రాసిచ్చాడు. వారం రోజులు వాడినా కొద్దిగా కూడా ఫలితం లభించలేదు. ఈలోగా కళ్ల పసుపు రంగులోకి మారుతున్నాయన్న విషయాన్ని స్నేహితులు, కుటుంబసభ్యులు గమనించి చెప్పారు. దాంతో టౌన్‌కి వెళ్లి డాక్టర్‌కు చూపించాను. అక్కడ పరీక్షలన్నీ చేసి హెపటైటిస్ వైరస్ సోకిందని, కామెర్లు వచ్చాయని చెప్పారు. హెపటైటిస్ వైరస్ ప్రాణాంతకం అని, కాలేయం పాడయిపోతుందని చెప్పేసరికి నాలో ఆందోళన మరింత రెట్టింపు అయింది. ఆ సమయంలోనే తెలిసిన మిత్రుడు ఒకడు హోమియో చికిత్స గురించి చెప్పాడు. దాంతో ఆగమేఘాల పరిగెత్తుకుంటూ డాక్టర్ రవికిరణ్ గారి దగ్గరకు వెళ్లాను.

**చికిత్స తరువాత :** హోమియో మందులతో త్వరగా కోలుకుంటావని, ఏమాత్రం భయపడాల్సిన అవసరం లేదని డాక్టర్ గారు ధైర్యం చెప్పారు. హోమియో చికిత్స మొదలు పెట్టాక వారం రోజుల్లోనే మంచి ఫలితం కనిపించింది. వికారం తగ్గింది. ఆకలి పెరిగింది. మామూలుగా ఆహారం తీసుకోవడం మొదలు పెట్టాను.. నెల రోజుల తరువాత చాలా మార్పు కనిపించింది. వైరల్ లోడ్ తెలుసుకునేందుకు పరీక్ష చేయిస్తే అతి తక్కువ స్థాయిలో ఉన్నట్లుగా తేలింది. జీవితం ముగిసిపోతుందన్న దశలో హోమియో చికిత్స ప్రాణాలు నిలిపింది.

# హెచ్ఐవి, హెర్పిస్‌ల బాధ పోయింది

**మా ఊరు** రాజమండ్రి. నా పేరు రాజేష్. ఏడాది క్రితం ఆత్మహత్యకు ప్రయత్నించాను. అదృష్టం కొద్దీ బతికి బయటపడ్డాను. నా కథ ఏంటంటే ఒకరోజు స్నేహితుల బలవంతంపైన ఒక అమ్మాయితో శృంగారంలో పాల్గొన్నాను. ఆ తరువాత కొద్ది నెలలకు పురుషాంగంపైన చెమట పొక్కుల మాదిరిగా నీటి పొక్కులు వచ్చాయి. విపరీతంగా దురద పెట్టేది. ఆ నీటి పొక్కులు పగిలి పుండు మాదిరిగా అయ్యేవి. డాక్టర్‌ను కలిస్తే కొన్ని పరీక్షలు చేసారు. ఆ పరీక్షలో నాకు హెచ్ఐవి ఉందని నిర్ధారణ అయింది. ఆ నీటిపొక్కులకు కారణం హెర్పిస్ అని తేలింది. ఆ రోజు ఎంత ఏడ్చానో చెప్పలేను. ఇక నా జీవితం ముగిసిపోయిందని నిర్ధారణకు వచ్చేశాను. ఆ సమయంలోనే డాక్టర్‌గారి ఆర్టికల్స్‌ను ఆంధ్రజ్యోతిలో చదివాను. ఆలస్యం చేయకుండా డాక్టర్‌గారిని కలిసాను. నా పరిస్థితి మొత్తం వివరిస్తే భయపడాల్సిన అవసరం లేదని, వ్యాధి గురించిన వివరాలన్నీ చెప్పారు. దాంతో నాకు కొండంత ధైర్యం వచ్చింది. ఆరు నెలల పాటు మందులు వాడితే హెర్పిస్ జాడలేకుండా పోతుందన్నారు. హెచ్ఐవి వైరస్ ఏమీ చేయలేని స్థితిలోనే ఉండిపోతుందన్నారు. డాక్టర్‌గారుచెప్పినట్లుగా మందులు వాడాను. మూడు నెలలో హెర్పిస్ పూర్తిగా పోయింది. నాకు పునర్జన్మను ప్రసాదించిన డాక్టర్‌గారికి జీవితాంతం రుణపడి ఉంటాను.

### హోమియో చికిత్స

హెచ్ఐవి, హెర్పిస్ సింప్లెక్స్ వంటి లైంగిక వ్యాధుల నివారణకు హోమియో చికిత్స అద్భుతంగా పనిచేస్తుంది. హోమియో చికిత్స మూలకారణాన్ని తొలగించే విధంగా ఉంటుంది. రోగనిరోధక శక్తి బలపడటం ద్వారా హెచ్ఐవి రోగుల్లో అవకాశవాద వ్యాధులన్నీ దూరమవుతాయి.

**Dr. K Ravikirane**
M.D.,M.sc(psych), P.G(virology)LONDON
గోల్డ్‌మెడల్ ఫర్ ఎక్సలెన్సీ ఇన్ మెడిసిన్
మాస్టర్స్ హోమియోపతి
అమీర్‌పేట్, కూకట్‌పల్లి, దిల్‌సుఖ్‌నగర్, హైదరాబాద్, విజయవాడ, కరీంనగర్, విశాఖపట్నం,తిరుపతి
ఫోన్ : 7842 106 106, 9032 106 106
V6లో ప్రతి మంగళవారం మధ్యాహ్నం 2:30కి
సాక్షిలో ప్రతి శనివారం మధ్యాహ్నం 2:30కి
10టీవీలో ప్రతి ఆదివారం మధ్యాహ్నం 3:30కి డాక్టర్‌గారి లైవ్ కార్యక్రమం ఉంటుంది.



# హోమియో చికిత్సతో జీవితంలో వెలుగులు

**నా పేరు రవి**. నా పెళ్లయి నాలుగేళ్ళవుతోంది. కానీ సంతానం కలగలేదు. మంచి మంచి ఆసుపత్రులన్నీ తిరిగాం. కానీ ఫలితం లేదు. పరీక్షలన్నీ చేసి వీర్యకణాల సంఖ్య తక్కువగా ఉందని అన్నారు. మందులు వాడితే సరిపోతుందన్నారు. ఏడాది పాటు మందులు వాడాను. కానీ పిల్లలు మాత్రం కలగలేదు. వీర్యకణాల సంఖ్య పెరగలేదు. ఆ సమయంలోనే హోమియో చికిత్స గురించి తెలిసింది. వెంటనే డాక్టర్ దగ్గరకు వెళ్లాను. ముందుగా సెమన్ అనాలసిస్ పరీక్ష చేయించమని చెప్పారు. రిపోర్టు వచ్చాక దానిపై అవగాహన కల్పించారు. వీర్య (సెమన్ అనాలసిస్) పరీక్ష ద్వారా వీర్యంలో ఉన్న లోపాలను గుర్తించవచ్చని అన్నారు. 'వీర్యంలో ప్రతి ఎంఎల్‌లో 60 నుంచి 120 మిలియన్ల వీర్యకణాలుండాలి. అందులో 80 శాతం కణాలు బాగుండాలి. వాటి కదలికలు బాగుండాలి. కానీ నా వీర్యంలో కణాలు తక్కువ సంఖ్యలోని ఉన్నాయి. ఉన్న కొన్ని కణాలు బాగాలేవు. అందువల్లే సంతానం కలగడం లేదు' అని డాక్టర్ చెప్పారు. హోమియో మందులతో సమస్య పోతుందని భరోసా ఇచ్చారు.

### చికిత్స తరువాత

హోమియో మందులు వాడటంతో వీర్యపుష్టి కలుగుతుందని చెబితే నమ్మలేదు. కానీ నా విషయంలో మందులు వాడిన తరువాతే అర్థమయింది. హోమియో మందులు ఎంత అద్భుతంగా పనిచేస్తాయో. హోమియో చికిత్స తరువాత వీర్యకణాల కదలికలు పెరిగాయి. డాక్టర్ గారు నా శారీరక ధర్మాలను, మానసిక లక్షణాలను పరిగణలోకి తీసుకుని మందులు ఇచ్చారు. దీనివల్ల మంచి ఫలితం లభించింది. హోమియో చికిత్స నా జీవితంలో వెలుగులు నింపింది. ఇప్పుడు నాకు ఒక బాబు. వాడు పుట్టాక నా జీవితం మొత్తం మారిపోయింది. డాక్టర్ గారికి ఎప్పటికీ రుణపడి ఉంటాను.

# నరాల జబ్బులు శాశ్వతంగా పోవాలంటే..

**చేతులు**, కాళ్లు, పాదాలు, ముఖం, నోరు...ఇలా శరీరంలోని అన్ని భాగాల నుంచి నరాలు వెన్నుపాముతోనూ, మెదడుతోనూ అనుసంధానించబడి ఉంటాయి. ఈ నరాల వ్యవస్థ ద్వారానే భౌతిక అనుభూతుల తాలూకు సంకేతాలను మెదడుకు అందుతాయి. అంటే కాలికి దెబ్బతగిలితే నొప్పి తెలియడం వెనక కారణం మెదడుకుసంకేతాలు చేరడమే. అయితే కొందరిలో కొన్ని కారణాల వల్ల ఈ నరాల వ్యవస్థ దెబ్బతింటుంది.

**కారణాలు :** కుటుంబంలో ఎవరైనా ఈ సమస్యతో బాధపడుతున్నట్లయితే వారి పిల్లలకు వచ్చే అవకాశం ఉంటుంది. డయాబెటిస్‌తో బాధపడే వారిలో ఎక్కువగా కనిపించే సమస్య ఇది. గాయాలు కావడం, దీర్ఘకాలంగా అనారోగ్యం ఉండటం, ఇన్‌ఫెక్షన్లు వంటివి కూడా కారణమవుతాయి. ఆల్కహాల్ అధికంగా సేవించడం, విషపూరితమైన కెమికల్స్‌కు ఎక్స్‌పోజ్ కావడం, కొన్ని రకాల వైరస్‌లు, బ్యాక్టీరియాలు నేరుగా నరాల టిష్యూపై దాడి చేయడం వల్ల కూడా ఈ సమస్య తలెత్తవచ్చు. హెచ్ఐవితో బాధపడే వారిలోనూ పెరిఫెరల్ న్యూరోపతి డెవలప్ అయ్యే అవకాశం ఉంటుంది.

### లక్షణాలు

చేతులు, పాదాల్లో పొడిచినట్లు అనిపించడం, తిమ్మిర్లు రావడం, చేతుల్లో నుంచి వస్తువులు జారిపడటం, పురుషుల్లో అంగస్తంభనలు తగ్గిపోవడం, మలబద్ధకం, జీర్ణసమస్యలు రావడం, డయేరియా, చెమటలు అధికంగా పట్టడం వంటి లక్షణాలుంటాయి.

### హోమియో చికిత్స

నరాల సంబంధ సమస్యలకు హోమియో మందులు అద్భుతంగా పనిచేస్తాయి. తిమ్మిర్లు, చెమటలు అధికంగా పట్టడం వంటివి తగ్గిపోతాయి. అంగస్తంభన సమస్యలు దూరమవుతాయి. మొత్తంగా కాంప్లికేషన్స్ అన్నీ దూరమయి ఆరోగ్యవంతమైన జీవనం గడిపే అవకాశం దక్కుతుంది.

ADVT

**ఆ వార్త వినగానే ఐటీ సిటీ బెంగళూరు ఒక్కసారిగా ఉలిక్కిపడింది... ఐటీ కారిడార్‌లో ఉన్న సంస్థల్లో నిశ్శబ్దం నెలకొంది. కంప్యూటర్లు, లాప్‌టాప్‌లపై టకటకలాడిస్తున్న వేళ్లు ఒక్క నిమిషం ఆగిపోయాయి. 'డెల్' ఉద్యోగిని పాయల్ సురేఖను గుర్తు తెలియని వ్యక్తులు ఆమె ఫ్లాట్‌లో హత్య చేశారన్న వార్త తీవ్ర సంచలనం సృష్టించింది.**




# వెంటాడిన పగ

**జే**పీ నగర్‌లోని అపార్ట్‌మెంట్ ...

బయట జనాల్ని పోలీసులు కంట్రోల్ చేస్తున్నారు. అప్పటికే వందల సంఖ్యలో ఐటీ ఉద్యోగులు అక్కడికి చేరుకున్నారు. 'నగరం నడిబొడ్డున పట్టపగలే హత్య జరిగింది. ఈ నగరంలో మహిళలకు రక్షణ లేదా?' అంటూ వారంతా నినదిస్తున్నారు. పరిస్థితి ఉద్రిక్తంగా మారుతుండటంతో పోలీసులు నగర పోలీస్ కమిషనర్ శంకర్ బిదిరికి సమాచారం అందించారు.

మరికాసేపటికి పోలీస్ కమిషనర్ అక్కడికి చేరుకున్నారు. జేపీనగర్ పోలీస్‌స్టేషన్ ఇన్‌స్పెక్టర్ రంజిత్ కమిషనర్‌ను ఫ్లాట్‌లోకి తీసుకెళ్లారు.

బెడ్‌పైన రక్తపుమడుగులో నిర్జీవంగా కనిపించింది సురేఖ. ఆమె మెడను కత్తితో కోశారు. శరీరం నిండా అనేక కత్తిపోట్లు. ఆమె ఒంటి మీదున్న లంగా, షర్ట్ రక్తంతో పూర్తిగా తడిచిపోయి ఉన్నాయి.

"సార్... ఐటీ కంపెనీలో పనిచేస్తుంది. ఈ ఫ్లాట్‌లో గత నాలుగు నెలలుగా ఒంటరిగానే ఉంటోందట..." అప్పటిదాకా తెలుసుకున్న సమాచారాన్ని కమిషనర్‌కు చెప్పాడు ఇన్‌స్పెక్టర్ రంజిత్.

"ఆమె తల్లిదండ్రులు, భర్త ఎక్కడుంటారు?"

"పేరెంట్స్ అసోంలో, హస్బెండ్ కటక్‌లో ఉంటారట..."

"వారికి మెసేజ్ వెళ్లిందా?..."

"కొలీగ్స్ మెసేజ్ పంపారట. రేపు ఉదయానికి ఇక్కడికి చేరుకోవచ్చు..."

"ఫార్మాలిటీస్ పూర్తి చేయండి. ఎంక్వయిరీ మొదలెట్టండి...



క్రైమ్‌సీన్ చూస్తుంటే ఎవరో బాగా తెలిసిన వ్యక్తే హత్యకు పాల్పడినట్లుగా అనిపిస్తోంది" అంటూ కొన్ని సూచనలిచ్చి అక్కడి నుంచి వెళ్లిపోయారు కమిషనర్.

సురేఖ మృతదేహాన్ని పోస్టుమార్టం నిమిత్తం బెంగళూరులోని కెంపగౌడ ఇనిస్టిట్యూట్ ఆఫ్ మెడికల్ సైన్సెస్‌కు తరలించారు పోలీసులు.



బెంగళూరు నగర పోలీసు కార్యాలయంలో సురేఖ హత్య కేసు సమీక్ష ప్రారంభమైంది.

"సార్... సురేఖ భర్త అనంతనారాయణ మిశ్రా కటక్‌లో జిమ్ నిర్వహిస్తున్నాడని, ఆమె డెల్ కంపెనీలో నాలుగు నెలల కింద ఉద్యోగంలో చేరిందని ఎంక్వయిరీలో తేలింది" అని ఇన్‌స్పెక్టర్ రంజిత్ కమిషనర్‌కు వివరించాడు.

"హత్య జరిగింది బెడ్ రూంలో. అయితే కిచెన్‌లోని సింకులో రెండు కాఫీ కప్పులున్నాయి. హత్యకు ముందు ఆమె ఎవరితోనో కలిసి కాఫీ తాగింది. అంటే ఈ హత్య ఆమెకు బాగా తెలిసినవారే చేశారని తెలుస్తోంది"

"అవున్సార్... ఆ కోణంలోనే ఎంక్వయిరీ చేస్తున్నాం" అన్నాడు ఇన్‌స్పెక్టర్.

ఈ మీటింగ్ జరుగుతుండగానే సురేఖ తల్లిదండ్రులు వచ్చినట్టు సమాచారం వచ్చింది.

"వాళ్లను తీసుకురండి" అని ఇన్‌స్పెక్టర్ రంజిత్ పోలీసులకు పురమాయించాడు.



సురేఖ తండ్రి దీన్ దయాల్, తల్లి కాంతాదేవి మరో ముగ్గురు బంధువులతో కలిసి పోలీస్‌స్టేషన్‌కు వచ్చారు. వాళ్లు వచ్చిన కొద్దిసేపటికే సురేఖ భర్త అనంతనారాయణ మిశ్రా కూడా కటక్ నుంచి వచ్చాడు.

"మీకెవరి మీదైనా అనుమానాలు ఉన్నాయా?"

రంజిత్ వేసిన ప్రశ్నకు సురేఖ తండ్రి దీన్ దయాల్ చూపు సురేఖ భర్త అనంతనారాయణ వైపు మళ్లింది. అది గమనించిన ఇన్‌స్పెక్టర్ సురేఖ తల్లిదండ్రుల్ని బయటకు పంపించి అనంతనారాయణను ప్రశ్నించడం ప్రారంభించాడు.

"సురేఖ హత్య జరిగిన సమయంలో మీరు ఎక్కడున్నారు" సూటిగా ప్రశ్నించాడు ఇన్‌స్పెక్టర్ రంజిత్.

"సార్... నేను కటక్‌లోనే ఉన్నాను. సురేఖను నేను ప్రాణంగా చూసుకుంటాను..."

"మీది లవ్ మ్యారేజా?...."

"అవున్సార్... మేమిద్దరం రెండేళ్ల క్రితం లవ్‌మ్యారేజ్ చేసుకున్నాం. నాకు కటక్‌లో 'కట్స్ అండ్ కర్వ్స్' అనే జిమ్ ఉంది. 'డెల్' కంపెనీలో ఉద్యోగం వచ్చేదాకా సురేఖ నాకు చేదోడువాదోడుగా జిమ్ నిర్వహణ చూసుకునేది. నాలుగు నెలల క్రితమే ఆమె ఉద్యోగ నిమిత్తం బెంగళూరుకు వచ్చింది. నా భార్యను ఇలా చూస్తాననుకోలేదు" అంటూ భోరుమన్నాడు అనంత్.

ఎంత ప్రశ్నించినా అతన్నుంచి మరే సమాచారం పోలీసులు రాబట్టలేక పోయారు.

అయితే "మీకెవరైనా శత్రువులున్నారా?" అన్న ప్రశ్నకు మాత్రం ఒక్క క్షణం ఆలోచించి బదులిచ్చాడు అనంత్.

"ప్రాణాలు తీసేంత పగలు ఎవరితోనూ లేవు కానీ వ్యాపారంలో ఒకరిద్దరితో సమస్యలున్నాయి"

"ఏమిటా సమస్య?..." ఏదైనా క్లూ దొరుకుతుందేమోనని అడిగాడు రంజిత్.

"సార్... గతంలో మా జిమ్‌లో పనిచేసి మానేసిన ఒక వ్యక్తితో గొడవ పడ్డాను. కానీ ఆ గొడవ జరిగి ఆరు నెలలు దాటింది..."

అయినా సరే గొడవ గురించిన పూర్తి సమాచారాన్ని ఇవ్వమనడంతో ఆ వివరాలను ఇన్‌స్పెక్టర్‌కు వివరించాడు అనంత్.



అంతలోనే సురేఖ సెల్‌ఫోన్ కాల్ డిటైల్స్ ఇన్‌స్పెక్టర్ ముందుంచాడు ఒక కానిస్టేబుల్. అపార్ట్‌మెంటు వాచ్‌మ్యాన్‌ని ప్రశ్నించిన క్రైమ్ కానిస్టేబుల్ ఓ కీలకమైన సమాచారాన్ని ఇన్‌స్పెక్టర్‌కు అందజేశాడు.

"సార్... ఆ రోజు ఉదయం పదిగంటల ప్రాంతంలో ఒడ్డూ పొడుగూ ఉన్న వ్యక్తి ఒకరు అపార్ట్‌మెంట్ దగ్గరకు వచ్చి సురేఖ ఫ్లాట్ నెంబర్ తెలుసుకున్నాడని వాచ్‌మ్యాన్ చెప్పాడు" అన్నాడు కానిస్టేబుల్.

వాచ్‌మ్యాన్‌ను పోలీస్‌స్టేషన్‌కు రప్పించి, అతను చెప్పిన పోలికల ఆధారంగా అనుమానితుడి ఊహాచిత్రాన్ని గీయించారు పోలీసులు.

ఆ ఊహాచిత్రాన్ని ముందుగా సురేఖ తల్లిదండ్రులకు చూపిస్తే ఎవరో తెలియదని వాళ్లు చెప్పారు. నెక్స్ట్ సురేఖ భర్త అనంత్‌కు ఆ ఊహాచిత్రం చూపించారు. దాన్ని చూడగానే అనంత్ ముఖకవళికలు మారిపోయాయి.

"సార్... వీడు జేమ్స్. ఇక్కడికెందుకు వచ్చాడు? అప్పట్లో మా జిమ్‌లో పనిచేసి డబ్బు లెక్కల్లో గోల్‌మాల్ చేసింది వీడే. ఆ విషయాన్ని సురేఖే పసిగట్టి నాకు చెప్పింది. దాంతో జేమ్స్‌ను ఉద్యోగంలో నుంచి తీసేశాను. తర్వాత మళ్లీ వాడితో కాంటాక్ట్ లేదు. ఒకవేళ సురేఖను జేమ్స్ హత్య చేశాడంటారా?..."

"ఆ విషయాలు ఎంక్వయిరీలో తేలుతాయి మిస్టర్ అనంత్..." అంటూనే జేమ్స్ గురించి ఆరా తీయమని పోలీసులను పురమాయించాడు ఇన్‌స్పెక్టర్ రంజిత్.

**"సార్... ఆ రోజు ఉదయం పది గంటల ప్రాంతంలో ఒడ్డూ పొడుగూ ఉన్న వ్యక్తి ఒకరు అపార్ట్‌మెంట్ దగ్గరకు వచ్చి సురేఖ ఫ్లాట్ నెంబర్ తెలుసుకున్నాడని వాచ్‌మ్యాన్ చెప్పాడు" అన్నాడు కానిస్టేబుల్.**

**వాచ్‌మ్యాన్‌ను పోలీస్‌స్టేషన్‌కు రప్పించి, అతను చెప్పిన పోలికల ఆధారంగా అనుమానితుడి ఊహాచిత్రాన్ని గీయించారు పోలీసులు.**

•••

పోలీసులు బెంగళూరు రైల్వేస్టేషన్లో, బస్టాండ్‌లో సీసీటీవీ ఫుటేజీని క్షుణ్ణంగా పరిశీలించారు. సురేఖ హత్య జరిగిన రోజు జేమ్స్ ఉదయం తొమ్మిది గంటల ప్రాంతంలో బెంగళూరులో రైలు దిగినట్టు పోలీసులు గుర్తించారు. అతడిని పట్టుకుంటే కేసు ఓ కొలిక్కి వస్తుందనుకున్నారు.

అక్కడి నుంచి ఇక జేమ్స్ కోసం వేట ప్రారంభమైంది. జేమ్స్ బెంగళూరు నుంచి హైదరాబాద్ వెళ్లినట్లు తెలుసుకుని ఒక పోలీస్ టీమ్ అక్కడికి బయలు దేరింది. అయితే పోలీసుల కదలికలను పసిగట్టి జేమ్స్ పారిపోతుండగా విజయవాడలో స్థానిక పోలీసుల సహకారంతో అదుపులోకి తీసుకుని బెంగళూరు తరలించారు.

పోలీసుల విచారణలో జేమ్స్ నిజాన్ని కక్కేశాడు. కటక్‌లోని 'కట్స్ అండ్ కర్వ్స్' జిమ్ తన వల్లే లాభాల బాటలోకి వెళ్లిందని, తన ద్వారానే అనేక మంది కస్టమర్లు జిమ్‌లో చేరారని చెప్పాడు. కస్టమర్లను జిమ్‌లో చేర్పించడం వల్ల కమిషన్ రూపంలోనే తనకు వేలాది రూపాయలు రావాల్సి ఉందని, డబ్బడిగితే దొంగతనం మోపి బయటకు వెళ్లగొట్టారన్నాడు. యజమాని తనకు చెల్లించాల్సిన డబ్బును ఆయన భార్య సురేఖ ఎప్పటికప్పుడు ఆపేసేదని, డబ్బడిగితే తిట్టేదని, బెదిరించేదని అన్నాడు. జిమ్ నుంచి బయటకు వెళ్లిపోయినా అక్కడి వర్కర్ల ద్వారా సురేఖ, అనంత్‌ల కదలికల్ని ఎప్పటికప్పుడు తెలుసుకుంటూనే ఉన్నానని చెప్పాడు. సురేఖ బెంగళూరులో ఉన్న విషయం తెలిసి, సమయం కోసం ఎదురుచూశానని చెప్పాడు.

"ఇంతకీ ఆ రోజు ఏం జరిగిందో చెప్పరా" అంటూ ఇన్‌స్పెక్టర్ రంజిత్ జేమ్స్‌ను రెండు దెబ్బలు వేశాడు.

"చెప్తాను సార్... ఆ రోజు సురేఖ ఇంటికి వెళ్లి తలుపుకొట్టాను. నన్ను చూసి ఆమె ఆశ్చర్యపోయింది. పని మీద బెంగళూరు వచ్చానని, మీరు ఇక్కడ ఉంటున్నట్లు తెలిసి ఊరికే కలిసి వెళ్దామని వచ్చానని అబద్ధం చెప్పా. సురేఖ నన్ను లోపలికి ఆహ్వానించి కాఫీ ఇచ్చింది. పాత విషయాలేవీ ఎత్తకుండా కుశల ప్రశ్నలు వేసింది. ఇంతలో ఆమెకేదో ఫోన్ వచ్చింది. ఫోన్ మాట్లాడుతూ బెడ్ రూంలోకి వెళ్లింది. సురేఖ అప్పుడు లంగా, షర్ట్‌లో ఉంది. ఆమె బెడ్‌రూంలోకి వెళ్లి కూర్చోవడం, నన్నేమీ తిట్టకుండా లోనికి ఆహ్వానించడంతో నా బుర్రలో రకరకాల ఆలోచనలు మెదిలాయి. జిమ్‌లో నాతో కాస్త చనువుగా ఉండటం గుర్తొచ్చింది. భర్తకు దూరంగా ఉంది కాబట్టి నాకు దగ్గర కావాలనుకుంటుందేమో అనుకున్నా. ఆ ఆలోచన నాకు పిచ్చెక్కించింది. వెంటనే బెడ్‌రూమ్ లోపలికి వెళ్లా. అప్పుడే సురేఖ నా వైపు తిరిగింది. నన్ను చూసి 'ఏయ్ ఇక్కడికెందుకు వచ్చావ్' అంటూ ముందుకు రాబోయింది. అంతే... అప్పటికే కోరికతో రగిలిపోతున్న నేను ఒక్కసారిగా ఆమె మీద పడ్డాను. నన్ను వదిలించుకోవడం కోసం పెనుగులాడింది. నేను వెళ్లకపోతే అరిచి కేకలు పెడతానని బెదిరించింది. ఆమె నుంచి ప్రతిఘటన ఎక్కువవడంతో కసిదీరా కొట్టాను. బెడ్ పక్కన ఫ్రూట్స్ బౌల్ ఉంది. అందులోని చాకు తీసుకుని ఇష్టం వచ్చినట్లు పొడిచేశా" అంటూ జేమ్స్ చెప్పిన విషయాలను ఇన్‌స్పెక్టర్ రంజిత్ వాంగ్మూలంగా రికార్డు చేశారు.

**- వేముల సత్యనారాయణ, 99854 88800**

## తెలుగు జాడలు - 2




# తెలుగు వారి శ్రమ సౌందర్యం

**సముద్రానికి ఆకాశానికి మధ్య సరిహద్దును చెరిపేస్తూ అలుముకున్న గాఢ నీలిమ. ఆవరించిన ఆకుపచ్చ గుట్టలు. పరచుకున్న తెల్ల ఇసుక తీరాలు. పాదాలకు గుచ్చుకునే గుల్ల సున్నపు రాళ్లు. అలల అలజడి లేని స్ఫటిక స్వచ్ఛ జలాలు. చెదిరిన ముత్యాల పోగులా భవనాలు. ఇంద్రుడి కన్నుగప్పి హిందూమహాసముద్రంలో దాగిన బుల్లి స్వర్గంగా భావిస్తారు మారిషస్ దేశాన్ని. దేశదేశాల పర్యాటకులూ రెక్కలు కట్టుకుని వచ్చి వాలే ఈ దేశపు సౌందర్యానికి రాళ్ళెత్తిన కూలీల్లో తెలుగువాళ్లు పెద్ద సంఖ్యలోనే ఉన్నారు. అయిదు తరాల కిందట కూలీలుగా, ఖైదీలుగా, బానిసలుగా ఈ నేలమీదకు వచ్చిన తెలుగు సంతతిని పలుకరిద్దామని బయలుదేరాం, ముగ్గురు తెలుగు దిమ్మరులం. కాకపోతే ఈసారి నా సహచరి విష్ణుప్రియ, మా అమ్మాయి రాగలీన మాతో కలిశారు.**

మారిషస్‌లో దిగీదిగగానే పితోన్ ప్రాంతంలోని సరస్వతి మందిరానికి వెళ్లాం. అది తెలుగువాళ్ల గుడి. భజన కోసం తెలుగువాళ్లు చాలామంది ప్రతి సాయంత్రం అక్కడకు చేరుతారు. మా రాక గురించి తెలిసి ఒక మధ్యవయస్సు వ్యక్తి వచ్చి పలకరించాడు. ఆయన పేరు మధుసూదన్. ఒక కాయితం మా చేతికిచ్చి మా ముఖాల్లోకి ఎంతో ఆతృతగా చూశాడు. అందులో ఏముందంటే, తరాల ముందు ఎప్పుడో తెలుగునేల మీద నుంచి మారిషస్‌కి వచ్చిన ఆయన పూర్వీకుల వివరాలు ఉన్నాయి. మారిషస్ ప్రభుత్వ ఆర్కైవ్స్ నుంచి ఆయన తెచ్చుకున్న సమాచారం అది. మధుసూదన్ ముని ముత్తాత పేరు అప్పడు. మారిషస్‌లో అడుగుపెట్టినపుడు అప్పడి వయస్సు 22 ఏళ్లు. తండ్రి పేరు చెల్లయ్య. ఊరు గొల్లలపాళెం, విశాఖపట్టణం జిల్లా. జాన్ అలెన్ అనే ఓడ ఆయనను 17.7.1866న మారిషస్‌కి మోసుకొచ్చింది. ఈ కాయితం చూపించి, అన్నా .. మా ఊరు ఎక్కడుంది? అని అడిగాడు ఎంతో ఆశగా. ఏడుతరాలు వెనక్కి వెతుక్కుంటూ ఆఫ్రికాకు వెళ్లిన అలెక్స్‌హేలీ గుర్తుకొచ్చాడు మధుసూదన్‌ని చూస్తే. ఇటువంటి అలెక్స్‌హేలీలు వేనవేలు ఉన్న దీవి మారిషస్.

**తెలుగువారి తరలింపు**

అయిదు వందల ఏళ్ల కిందట మానవ సంచారం లేని పచ్చని పగడాల దిబ్బ ఇది. ఆఫ్రికాకు ఆగ్నేయంగా హిందూమహాసముద్రం లో ఉన్న ఈ దీవిని 12వ శతాబ్దంలో అరబ్బునావికు లెవరో గుర్తించారట. కొన్నేళ్లు డచ్‌వారి, ఫ్రెంచ్‌వారి ఆధీనంలో ఉన్న తర్వాత 1810లో బ్రిటిషువాళ్లు దీన్ని ఆక్రమించుకుని నివాసయోగ్యం చేయడానికి పూనుకున్నారు.

తొలుత ఆఫ్రికా నుంచి బానిసలను తరలించడానికి ప్రయత్నిం చారు. సేవలకే తప్ప నిర్మాణ పనులకు వాళ్ళు ఉపయోగపడలేదు. దాంతో తమ ఆధీనంలోనే ఉన్న భారతదేశం నుంచి మనుషులను తరలించడం మొదలుపెట్టారు. మొదట కేరళ తీరం నుంచి పడ వల్లో మందలు మందలుగా జనాల్ని తరలించారు. ఆ తర్వాత తూర్పు తీరం నుంచి పడవ ప్రయాణాలు పెరిగాయి. కాకినాడ దగ్గ రలోని కోరంగి నుంచి చెన్నపట్టణం దాకా ఉన్న అన్ని రేవుల నుంచి పడవలు ఇక్కడికి బయలుదేరాయి.

"ఒక్క 1843 సంవత్సరంలోనే భారతదేశం నుంచి మారిషస్‌కి 35 ఓడలు ఎనిమిది వేల మందిని తరలించాయి. ఇందులో సగం మంది తెలుగువాళ్ళే. 1836 జూలైలో కోరంగి రేవు నుంచి గేంజస్ అనే ఓడలో తెలుగువాళ్ళు తొలిసారి మారిషస్‌కి చేరుకున్నారు" అని మారిషస్‌లోని మహాత్మాగాంధీ ఇనిస్టిట్యూట్‌లో క్వాలిటీ అస్యూరెన్స్ విభాగాధిపతిగా ఉన్న రెడ్డి లక్ష్మణుడు చెప్పారు.

కాని "1735లోనే మహేదొలాబుర్దొనే అనే ఫ్రెంచ్ గవర్నర్ దక్షిణ భారతదేశం నుంచి కాపువారిని తీసుకువెళ్ళి మారిషస్ రాజధాని



**1900 ఆరంభంలో మారిషస్‌లో ఒక తెలుగు కుటుంబం**

అయిన లూయీ రేవు పట్టణాన్ని నిర్మింపజేశాడు. దురదృష్ట వశాత్తూ ఆ దక్షిణాది కాపువారు ఎవరో వివరాలు లేవు" అని వేటూరి ఆనందమూర్తి అనే మరో తెలుగాయన అంటారు. గంజాం నుంచి చెన్నపట్టణం దాకా ఉన్న తెలుగు ప్రాంతం నుంచే అప్పట్లో ఇక్కడికి పడవ ప్రయాణాలు సాగేవి గనుక లూయీ రేవు పట్టణాన్ని నిర్మించిన కాపువారు బహుశా తెలుగు వారే అని భావించవచ్చు.

**తెలుగు సంతతి మూలాలు**

నిజానికి భారత భూభాగం నుంచి వచ్చిన ఓడలు, ప్రయాణీకుల పేర్లు, కులాలు, వారి ఊళ్ళ పేర్లు వంటి వివరాలన్నీ మారిషస్ ఆర్కైవ్స్‌లో ఉన్నాయి. అయితే 1835 నుంచి మాత్రమే ఈ వివరాలు దొరుకుతున్నాయి. ఇచ్ఛాపురం, బరంపురం, చికాకోల్, సామర్లకోట, కాకినాడ, కోరంగి, విశాఖ, రాజమండ్రి, పాలకొండ, కొత్తపేట, విజయనగరం, పెద్దాపురం, బందరు, బెజవాడ, ఒంగోలు, వేటపాలెం, గుంటూరు, మంగళగిరి, ఉప్పునెల్లూరు, నెల్లూరు, చిత్తూరు, పుత్తూరు, కడప, రాజంపేట, చాగలమర్రి, నాయుడుపేట, వెంకటగిరి, పోలూరు, బద్వేలి, హైదరాబాదు, బాన్స్‌వాడ, నిర్మల్, నూనూరు, తాండూరు, మంథెన, బాసర బళ్ళారి, మదరాసు, చెంగల్పట్ ... ఇలా ఎన్నో ఊళ్ళ నుంచి తెలుగువాళ్లు మారిషస్ చేరుకున్నారు. ఒక్క 1858లోనే 52 వేల మంది మారిషస్‌కి వలసవచ్చారని నమోదైంది.

అలా వచ్చినవారు అడవులు నరికారు. రాళ్ళు రప్పలు ఏరారు. రేవులు నిర్మించారు. ఇళ్లు కట్టారు. వ్యవసాయం చేశారు. మరీ ముఖ్యంగా చెరకుతోటల్లో పనులు చేయడానికి బ్రిటిషువాళ్ళు తెలుగువాళ్ళని పెద్ద సంఖ్యలో ఇక్కడికి తరలించారు. అయితే, ఈ ప్రయాణం పూర్తిగా సాఫీగా ఏమీ సాగలేదు. వచ్చినవాళ్లు ఎన్నో వైపరీత్యాలను ఎదుర్కొన్నారు. తుఫాన్‌లకు పడవలు మునిగిపోయి దారిలోనే చాలా మంది చచ్చిపోయారు. దీవి మీద అడుగుపెట్టినవాళ్ళని రోగాలు చుట్టుముట్టేవి. 1800 మధ్యప్రాంతంలో మలేరియా బారిన పడి ఒక్క లూయీ నగరంలోనే రోజుకి రెండు మూడు వందల మంది చనిపోయారట. ఆ ఏడాది జనాభా లెక్కల్లో 12 వేల మంది జాడ తెలియకుండా పోయింది. కనీసం మరణించారని కూడా నమోదు కాలేదు. ఇన్ని కడగండ్లను ఎదుర్కొని, తమ దీవిని అందంగా మలచుకున్నారు తెలుగువాళ్లు.



సరస్వతి మందిరంలో తెలుగువారి భజన

**కట్టూ, బొట్టూ వీడలేదు**

1870లో మారిషస్ దీవి జనాభా మూడు లక్షలు. అందులో భారతీయుల సంఖ్య 1.29 లక్షలు. ప్రస్తుతం మారిషస్ జనాభా 13 లక్షలు. ఇందులో సగానికి పైగా భారతీయులే. వీరిలో తెలుగు సంతతి సంఖ్య లక్షన్నర. దీవి నలుమూలలా విస్తరించిన తెలుగుజనం అనేక రంగాల్లో స్థిరపడ్డారు. మంత్రులుగా, ప్రభుత్వ కార్యదర్శులుగా, లాయర్లూ, డాక్టర్లూ, వ్యాపారులుగా రాణిస్తున్నారు. తరాలు మారిపోయినా, వేల మైళ్ళ దూరంలో ఉన్నా, పూర్వీకులు పుట్టిన గడ్డను ఎన్నడూ కళ్ల చూడకపోయినా 'మేం తెలుగువాళ్ళం, మాది తెలుగుజాతి' అని గర్వంగా చెబుతారు. ఇంత కాలం గడిచినా కట్టూ బొట్టూ వీడలేదు. దేశం మారినా ఆటా, పాటా మరవలేదు.



మారిషస్ వైస్ ప్రెసిడెంట్ పరమశివం పిళ్లైతో వ్యాసకర్త ( ఎడమ చివర )

**తెలుగు అక్షరాలు దిద్దుతున్నారు**

ఒక దశలో ఫ్రెంచ్, ఇంగ్లీషు భాషా సంస్కృతుల ప్రభావం మారిషస్ తెలుగు కుటుంబాలనూ ముంచెత్తింది. అధికార భాష 'క్రియోల్' తెలుగు లోగిళ్ళలోకీ ప్రవేశించింది. 1900 ప్రారంభం నాటికే తెలుగు అక్షరం, తెలుగు మాట మాయమయ్యే పరిస్థితి మారిషస్ దీవిలో ఏర్పడింది. దీనిని గుర్తించిన తెలుగు పెద్దలు ఆందోళన చెందారు. ఫలితంగా 1940 నుంచి పండిట్ రామమూర్తి ఇల్లిల్లూ తిరిగి తెలుగుప్రచారం మొదలు పెట్టారు. 1960లో పండిత్ ఒట్టు ఈ బాధ్యత తీసుకున్నారు. 1946లో మొదలైన మారిషస్ ఆంధ్ర మహాసభ కూడా ఈ విషయంలో క్రియాశీల పాత్ర పోషించింది. వీరి ప్రయత్నం వల్ల తెలుగు బోధన 1958 నుంచి ప్రభుత్వ బడుల్లో మొదలైంది. ఇప్పుడు ప్రాథమిక నుంచి హయ్యర్ సెకండరీ దాకా తెలుగులో చదువుకునే అవకాశం ఉంది. దాదాపు 600 తెలుగు బడులు నడుస్తున్నాయి. 4000 మంది తెలుగులో చదువుకుంటున్నారు. 200 మంది తెలుగు టీచర్లున్నారు. ఎలాగైతేనేం ప్రభుత్వ సహకారంతో తెలుగు అక్షరాన్ని కాపాడుకున్నారు.

**సంస్కృతిని కాపాడుకుంటున్నారు**

తెలుగు పండుగల వల్ల ఆటపాటలను, ఆచారాలను కాపాడుకున్నారు కానీ తెలుగు మాటని నిలబెట్టుకోవడానికి మాత్రం ఇప్పటికీ తంటాలు పడుతూనే ఉన్నారు. బడికీ, గుడికీ మాత్రమే తెలుగు పరిమితమవడం తెలుగుపెద్దల్ని కలవర పెడుతోంది. అయినా తెలుగును నిలబెట్టుకోవడానికి తమ పూర్వీకుల లాగే వారు కూడా ఇప్పుడు గుడులనే కేంద్రాలుగా చేసుకున్నారు. వారానికి ఒక రోజు తప్పనిసరిగా కుటుంబంతో కలిసి గుడికి వెళ్తారు. చీరలు, ధోవతులు ధరించి వస్తారు. రామభజనకు చాలా ప్రాధాన్యం ఇస్తారు. మద్దెల, తబలా, హార్మోనియం వంటి సంప్రదాయిక వాయిద్యాలతో తెలుగు పాటలు పాడతారు. కోలాటాలు ఆడతారు. అక్కడే కలిసి భోజనాలు చేస్తారు. ఆ రోజంతా తెలుగులోనే మాట్లాడుకుంటారు. మహాత్మాగాంధీ సంస్థలో తెలుగు విభాగాధిపతిగా పనిచేస్తున్న సంజీవనరసింహ అప్పడు మా మారిషస్ తెలుగు యాత్రకు దిక్సూచిలా సహకరించారు. ఇంటికి ఒకటో రెండో కార్లు, సొంత ఇళ్లు, సొంత పొలాలు, ఉద్యోగాలు, వ్యాపారాలతో ఈ అయిదో తరం తెలుగు జనం స్థిమితంగానే ఉన్నా తెలుగు అక్షరం కాపాడుకోవాలనే తపన, తమ మూలాల కోసం అన్వేషణ, తమ నెత్తుటి బంధాలు నిలుపుకోవాలనే వారి ఆరాటం చూస్తే మనసు సంతోషంతో తొణికిసలాడింది. అదే సమయంలో సముద్రాలకు ఆవల ఉండిపోయిన ఈ అన్నదమ్ములూ అక్కచెల్లెళ్ళ గురించి మనం కనీసం ఆలోచించడం లేదే అనే బాధ కూడా కలిగింది.

**– ఆర్.ఎం. ఉమా మహేశ్వరరావు, 99854 25888**

● వచ్చేవారం : 'అమ్మ మరచిన బిడ్డలం' అంటున్న మలేసియా తెలుగు ప్రజల సంగతులు

# బేతాళ ప్రశ్న-20

శేఖర్ తన బావమరిది ప్రదీప్‌కు 100 రూ నోటు ఇచ్చి చిల్లర తీసుకు రమ్మన్నాడు. అయితే అందులో పది రూపాయల నోట్లు ఉండకూడదు, నోట్లు మాత్రం తప్పని సరిగా పది ఉండాలని షరతు పెట్టి చిన్న నోట్లు కూడా తీసుకుంటానని చెప్పాడు. ప్రదీప్ చిల్లర ఎలా తీసుకురాగలడు?

**గతవారం సమాధానం:** మొత్తం వజ్రాలు 301. ఇద్దరు పంచుకున్నప్పుడు చెరో 150 రాగా ఒకటి మిగిలింది. ముగ్గురు పంచుకున్నప్పుడు తలా 100, నలుగురికి తలా 75, ఐదుగురికి తలా 60, ఆరుగురికి తలా 50 వచ్చి ఒక వజ్రం మిగులుతూ వచ్చింది. ఏడుగురు పంచుకున్నప్పుడు మాత్రం తలా 43 వజ్రాలు వచ్చి, ఒక్క వజ్రమూ మిగలకుండా అందరికీ సమాన వాటా వచ్చింది.



మీ దగ్గర ఇలాంటి మెదడుకు మేతవేసే ప్రశ్నలు భేతాళ ప్రశ్నలు ఉంటే జవాబుతో పాటు మా ఈమెయిల్ kerintha.aj@gmail.com కు పంపించగలరు

**బేతాళ ప్రశ్న-18కి సరైన సమాధానం పంపిన మొదటి ముగ్గురు:** గౌరీశ్వర్, వైజాగ్; శ్యామ్ గణేశ్, వద్దడి; కే. లీలాజ్యోతి, సత్తుపల్లి

# నీళ్లు నింపుకునే బాటిల్



ప్రయాణం మధ్యలో మంచినీళ్లు అయిపోతే... కొత్త బాటిల్ కొనుక్కుంటాం. అది దొరకకపోతే ఎవరింటికైనా వెళ్లి మంచినీళ్లు అడుగుతాం. రెండూ కుదరకపోతే దాహంతో అలమటించిపోతాం. ఇకపై ఆ బాధ ఉండబోదంటోంది ఆస్ట్రియన్ అంకుర సంస్థ ఫాంటస్. ఈ సంస్థ గత ఏడాది ఓ కొత్త వాటర్‌బాటిల్‌ని ఆవిష్కరించింది. దాని పేరు 'సెల్ఫ్ ఫిల్లింగ్ వాటర్ బాటిల్'. సోలార్-పవర్డ్ టెక్నాలజీతో పనిచేసే ఈ బాటిల్‌లో రెండు అరలున్న కూలర్ ఉంటుంది. ఈ కూలర్ 'పెల్టియర్ ఎఫెక్ట్' (Peltier Effet) పద్ధతిలో పనిచేస్తుంది. పెల్టియర్ ఎఫెక్ట్ అంటే ఉష్ణోగ్రతల్లోని మార్పులను ఎలక్ట్రానిక్ వోల్టేజీగా మార్చుకునేందుకు ఉపయోగపడే సూత్రం. ఆ సూత్రం ఆధారంగా కూలర్‌లోని మొదటి అరలోకి వేగంగా ప్రవేశించే గాలి ఆ తర్వాత అనేక అడ్డంకుల వల్ల వేగాన్ని కోల్పోయి రెండో అరలోకి ప్రవేశిస్తుంది. అక్కడ గాలి చల్లబడి దానిలోని తేమ నీటి బిందువుల రూపంలో బాటిల్‌కు చేరుతుంది. అలా బాటిల్ నిండుతుంది. గంట సమయంలో అరలీటర్ బాటిల్ నీటితో నిండిపోతుంది. ఈ సెల్ఫ్ ఫిల్లింగ్ బాటిల్స్‌లో రెండు రకాలున్నాయి. వాటిలో మొదటిది ఫాంటస్ ఎయిరో... దీనిని బ్యాక్‌ప్యాక్‌లో పెట్టుకుని వెళ్లవచ్చు. రెండోది సైకిల్ రైడర్స్ కోసం ఉద్దేశించిన ఫాంటస్ రైడ్. దీనిని సైకిల్‌కి తగిలించుకోవచ్చు.

# మీకు తెలుసా



- జపాన్‌కి చెందిన కొయ్ అనే చేప జీవితకాలం 200 ఏళ్లు.
- సాలీడు పిల్లని స్పైడర్లింగ్ అంటారు.
- చైనాలో ఫేస్‌బుక్, స్కైప్, ట్విట్టర్... అన్నీ నిషిద్ధమే.
- 'కోల్గేట్' అంటే స్పానిష్‌లో 'వెళ్లి ఉరేసుకో' అని అర్థమట!
- జామకాయల్లో 150 రకాలున్నాయి.

# మెట్లులెక్కగలవా...?

వియత్నాం సర్కస్ సోదరులు జాంగ్ నెగాయ్ (Giang Neghiep) , జాంగ్ కో (Giang Co)లు ఎవరినైనా ఇలా అడిగితే ఆశ్చర్యం లేదు. ఎందుకంటే వాళ్లు సాధించిన ఘనత అలాంటిది మరి! మెట్లు ఎక్కడమంటే డాబా మెట్లు ఎక్కినట్టు కాదు. ఇద్దరిలో ఒక వ్యక్తి మెట్లు ఎక్కడానికి సిద్ధంగా నిలుచుంటే అతడి తలపై తల ఆనించి గాల్లో శీర్షాసనం వేస్తాడు రెండో వ్యక్తి. అంటే మెట్లెక్కే మొదటి వ్యక్తి పైనున్న వ్యక్తిని బ్యాలెన్స్ చేసుకుంటూ మెట్లెక్కాలి. ఇదే పద్ధతిలో ఈ సోదరులిద్దరూ స్పెయిన్‌లోని సెయింట్ మేరీస్ కెథెడ్రల్ భవనం బయటున్న 90 మెట్లను 52 సెకన్లలో ఎక్కి గిన్నిస్ రికార్డులకెక్కారు.





# మాన్‌సెల్ సీ ఫోర్ట్స్

నీళ్లల్లో కనిపించే ఈ చిన్న చిన్న ఇళ్లల్లో ఎవరుంటారబ్బా? అని ఆశ్చర్యపోతున్నారా. రెండో ప్రపంచ యుద్ధంలో జర్మనీ దాడుల నుంచి ఇంగ్లండ్‌లోని కెంట్ నగరాన్ని రక్షించడం కోసం ఈ ఆర్మీ సీ ఫోర్ట్స్‌ని నిర్మించారు. ఇంగ్లండ్‌లోని థేమ్స్, మెర్సీ నదీముఖాల వద్ద పూర్తిగా వీటిని కాంక్రీటు, లోహాలతో డిజైన్ చేసింది... మాన్‌సెల్ అనే ఇంజనీరు. రెండో ప్రపంచ యుద్ధం తర్వాత వీటిని సైన్యం ఖాళీ చేస్తే... సముద్ర దొంగలకు అవి రేడియో స్టేషన్లలా ఉపయోగపడ్డాయి. ప్రస్తుతం పర్యాటకులు మాత్రమే ఇక్కడకు అడపాదడపా వస్తున్నారు.







# గోల్డెన్ జీబ్రా

చారలగుర్రం నలుపు, తెలుపుల్లోనే ఉంటుందని మనకు తెలుసు. కానీ తెల్లని దేహంపై బంగారు చారలతో మెరిసిపోయే గోల్డెన్ జీబ్రాలు కూడా ప్రపంచంలో ఒకటో, రెండో ఉన్నాయట. వేరేలోకం నుంచి ఊడిపడినట్టుగా ఉన్న ఈ జీబ్రాలు నిజానికి కూడా పిగ్మెంటేషన్ ప్రాబ్లం వల్ల ఇలా అయి ఉండవచ్చని జీవ శాస్త్రవేత్తలు చెబుతున్నారు.



# దారి కనుక్కోండి






## స్మార్ట్‌గా వంట చేసేయొచ్చు...

వంటల పుస్తకంలో చదివి వంట చేసేవాళ్లకు చాలా విషయాల్లో అవగాహన ఉండదు. ఉప్పు ఎంత వేయాలి? కారం ఎంత వేయాలి వంటి విషయాలు సరిగ్గా అర్థంకావు. ఎంత వేయాలో ఉన్నా చాలాసార్లు పక్కాగా తూచి వేయడం సాధ్యంకాదు. అలాగే చక్కెర పొడి, బియ్యప్పిండి, మైదా.. జీలకర్ర, సోంపు.. ఆవాలు, రాగులు.. ఇలా కొన్ని పదార్థాలు చూడడానికి ఒకేలా ఉండడంతో గుర్తించడం కూడా వాళ్లకు కష్టమవుతుంది. అలాంటి ఇబ్బందులను దూరం చేస్తాయి ఈ 'స్మార్టీ ప్యాన్స్' (smarty pans). చూడడానికి సాధారణ పెనంలాగే కనిపించే ఈ ప్యాన్లు స్మార్ట్‌ఫోన్ యాప్ ద్వారా ఏ వంట చేయా లనుకుంటే అది వండే విధానం చెబుతూ.. ఏయే పదార్థాలను వేస్తున్నాం, ఎంత పరిమాణంలో వేస్తున్నాం, ఎంత వేడితో వండుతున్నాం, ఇవన్నీ చేసే వంటకు సరిగా సరిపోతాయా.. లేదా? అనే విషయాలను ఎప్పటికప్పుడు చెబుతాయి. సెన్సార్ ద్వారా పనిచేసే ఈ 'స్మార్ట్' పెనం మన వంటలోని క్యాలరీలను కూడా లెక్కకట్టి చూపిస్తుంది.



## మాడు వాసన రాదు..



క్యాబేజీ కూర రుచిగానే ఉంటుంది కాని అది వండేటప్పుడు వచ్చే వాసన చాలామందికి పడదు. అలాగే కొన్ని రకాల వంటలు వండేటప్పుడు వచ్చే ఘుమఘుమలు బాగుంటాయి కాని అవి మాడిపోతే వచ్చే వాసన మాత్రం భరించలేం. ఇలాంటి ఇబ్బందులు రాకుండా చేస్తుంది ఈ 'ప్యూరిఫై ప్యాన్' (purify pan). ఇది కూడా చూడడానికి సాధారణ పెనంలాగే కనిపించినా దీనికి ఒకవైపు అమర్చి ఉండే ప్యూరిఫైయర్ వంట నుంచి వచ్చే వాసనలను గ్రహించి, ఫ్లేవర్ మార్చి సువాసనను వెదజల్లుతుంది. అలాగే అప్పడాలు వేగించినప్పుడు, చిప్స్ వంటి వేపుడులు చేసినపుడు వంటింటి నిండా పొగచేరి ఇంట్లో వాళ్లను ఉక్కిరిబిక్కిరి చేయకుండా కాపాడుతుంది.

## ఫోన్‌తో కంట్రోల్ చేసేయొచ్చు..

వంట వండుతూ మధ్యమధ్యలో హాల్‌లోకి వెళ్లి టీవీ చూడడం అందరికీ ఉండే అలవాటే. అయితే టీవీలో లీనమైతే ఒక్కోసారి పొయ్యి మీద పెట్టిన పదార్థాలేమీ గుర్తుకురావు, పాలైనా.. అన్నమైనా.. కూరయినా. ఈ 'క్రోక్‌పాట్ స్మార్ట్ స్లో కుక్కర్ ' (Crockpot Smart Slow Cooker)లో వండితే అటువంటి ఇబ్బందులేమీ ఉండవు. హాలులో కూర్చొని టీవీ చూస్తూనే వంటగదిలో కుక్కర్ ఉష్ణోగ్రతను నియంత్రించవచ్చు, ఆఫ్ కూడా చేయవచ్చు. మొబైల్ యాప్ ద్వారా పనిచేసే ఈ కుక్కర్‌ను 2జీ, 3జీ, వైఫై ద్వారా సమాచారాన్ని పంపి నియంత్రించవచ్చు. కూరలు, బిర్యానీలే కాదు కాఫీ, టీ వంటి పానీయాలు సైతం తయారుచేసుకునేందుకు వీలుగా ఈ కుక్కర్‌ను రూపొందించారు.







ఈ వస్తువులను వాటి పేరుతో నెట్‌లో సెర్చ్ చేసి, వివిధ ఆన్‌లైన్ సంస్థల ద్వారా కొనుగోలు చేయవచ్చు.

## చిటికెలో కట్ చేసేయండి



ఈ 'వెజ్జి చాప్ వెజిటెబుల్ చాపర్' (VeggiChop Vegetable Chopper) పండ్లు, కూరగాయలను చిటికెలో చిన్న ముక్కలుగా కత్తిరించేందుకు ఉపయోగపడుతుంది. వేళ్లు ఎక్కడ కోసుకుపోతాయో అనే భయంతో జాగ్రత్తగా కోయాల్సిన పనిలేదు. ముందుగా పండ్లను పెద్ద ముక్కలుగా కోసి ఈ చాపర్‌లో వేయాలి. బొంగరానికి ఉండే దారంలా దీనికి పైన ఒక దారం ఉంటుంది. దాన్ని లాగితే లోపలున్న బ్లేడులు తిరిగి పండ్లను చిన్న చిన్న ముక్కలుగా కోసేస్తాయి. వంట త్వరగా పూర్తి కావాలనుకునేవారికి, తక్కువ సమయంలో ఎక్కువమందికి సలాడ్స్ చేయాలనుకునే వారికి ఈ చాపర్ బాగా ఉపయోగ పడుతుంది. ముక్కలు కోసుకోవడానికే కాకుండా టమోటా, ఉల్లిపాయ వంటి కూరగాయలను గరకుగా రుబ్బుకోవడానికి కూడా ఈ చాపర్‌ను వాడవచ్చు.

# ఎందుకు...?



## ఎప్పుడూ పచ్చగానే ఉంటాయి...?



పైన్ వృక్షాలు ఏ కాలంలోనైనా పచ్చగా ఉంటాయి. ఆకు రాలు కాలంలో కూడా అవి మిగిలిన చెట్లలా బోడులైపోవు. కారణం వాటి ఆకుల నిర్మాణమే. పైన్ వృక్షాలు ఎక్కువగా శీతల ప్రదేశాల్లో పెరుగుతాయి కాబట్టి చలిగాలుల్ని తట్టుకునే విధంగా వాటి ఆకులు సూదుల్లా ఉంటాయి. కొద్దిపాటి పోషకాలతోనే పైన్ వృక్షం బతకగలుగుతుంది. అందువల్ల ఆకులు రాలిపోవడం అనే బాధ ఉండదు. మందమైన పైన్ ఆకుల పైపొర నీటిని నిలువ చేస్తుంది కాబట్టి నీరు లేకపోయినా ఆకులు తొందరగా ఎండిపోవు. అంతేగాక మంచు, ఎండల ప్రభావం పడకుండా ఆకులపై దట్టమైన మైనపు పూత ఉంటుంది. దాని వల్ల వేసవిలో ఆకులలోని నీరు ఆవిరయ్యే పరిస్థితి ఉండదు. పాత ఆకులు రాలిపోతే వాటి స్థానంలో వెంటనే కొత్త ఆకులు పుట్టుకొస్తాయి. అందువల్ల పైన్ వృక్షాలు ఎప్పుడూ ఎండిపోయి గాని బోడిగా గాని కనిపించవు.

## డాల్ఫిన్లు బయటకు వస్తాయి...?



జలచరాలు నీటిలో కరిగిన ఆక్సిజన్‌ని గ్రహించడం రెండు విధాలుగా జరుగుతుంది. ఒకటి మొప్పలు ద్వారా (చేపలు), రెండు చర్మం(కప్పలు) ద్వారా. అయితే జలచరాలన్నిటికీ ఈ ఏర్పాటు లేదు. డాల్ఫిన్లు, తిమింగలాలు, మొసళ్లు, సీల్ చేపలు... ఇలా కొన్ని రకాల జలచరాల్లో మొప్పలు ఉండవు. అలాగే వాటి దేహ నిర్మాణం దృష్ట్యా చర్మం ద్వారా ఆక్సిజన్ పీల్చుకునే అవకాశమూ వాటికి లేదు. అవి గాలిలోని ఆక్సిజన్‌ని మాత్రమే పీల్చుకోగలవు. అందుకే అవి తరచూ నీటి ఉపరితలంపైకి వచ్చి గాలిని వదిలి, కావాల్సినంత గాలి పీల్చుకుని మళ్లీ నీటిలోకి వెళ్లిపోతాయి.

## భలే మంచి చౌక బేరమూ ..!

ఇంటికొస్తున్న భార్యా భర్తలకు దారిలో ఒక షాపు ముందు బెనారస్ చీర - 10 రూపాయలు; నైలాన్ చీర - 8 రూపాయలు ; కాటన్ చీర - 6 రూపాయలు అని రాసి ఉన్న బోర్డు కనిపించింది.

"అబ్బ .. ఎంత మంచి అవకాశం! 50 రూపాయలివ్వండి. 6 చీరలు కొనుక్కొస్తాను" సంతోషంగా అడిగింది భార్య.

"సరిగ్గా చూడు .. అది బట్టలమ్మే షాపు కాదు .. ఇస్త్రీ షాపు" తల బాదుకున్నాడు భర్త.

## మిక్చర్ పొట్లం

బొమ్మలు : **వెంకట్**

### నేనసలే సెన్సిటివ్!



"మన పిల్లి పిల్ల ఎలా ఉంది?" క్యాంపుకు వెళ్లిన భర్త ఫోన్ చేసి అడిగాడు.

"చచ్చిపోయిందండీ" చెప్పింది భార్య.

"అయ్యో .. ఎలా?" కంగారు పడ్డాడు భర్త.

"గోడపైనుండి పడి" చెప్పింది భార్య.

"అయ్యో .. అయినా అంత సడన్‌గా చెబుతావేంటి? ముందు గోడ ఎక్కిందని, తర్వాత జారి పడిందని, ఆ తర్వాత శ్వాస వదిలిందని చెప్పొచ్చు కదా! అన్నట్టు నేను వచ్చేముందు మా అమ్మకు ఒంట్లో బాగో లేదు కదా .. ఇప్పుడెలా ఉంది?"

"నిన్ననే గోడ ఎక్కిందండి .." చెప్పింది భార్య.

### పిల్లలు మాత్రమే ..

ఇతర దేశం నుండి వచ్చిన ఒక టూరిస్టు ఇండియాలో పర్యటిస్తూ ఒక గ్రామం గుండా వెళ్తున్నాడు.

"ఈ గ్రామంలో ఎవరైనా గొప్పవారు పుట్టారా?" అడిగాడు టూరిస్టు.

"లేదండి. అందరూ చిన్న పిల్లలే పుట్టారు" చెప్పాడు టాక్సీ డ్రైవర్.

### వాణ్ణి సుఖపడనివ్వద్దు ప్లీజ్!



"మా పక్కింటాయన భార్య కనిపించడం లేదు సార్ .."

"పక్కింటాయన భార్య గురించి నువ్వెందుకు పోలీస్ స్టేషన్‌కు వచ్చి కంప్లయింట్ ఇస్తున్నావు?!"

"వాడు రోజూ పార్టీలు చేసుకోవడం భరించలేకపోతున్నాను సార్ .."

## నా వంతు తీసుకో!



"సార్, మా రాజకీయ నాయకుడు కిడ్నాప్‌కు గురయ్యాడు. విడిచిపెట్టడానికి 10 కోట్లు డిమాండ్ చేస్తున్నారు. లేదంటే పెట్రోలు పోసి తగలబెడతామని బెదిరిస్తున్నారు. అతడ్ని విడిపించడానికి విరాళాలు సేకరిస్తున్నాం .. మీ వంతు .." కారుని ఆపి అడిగారు సదరు నాయకుడి పార్టీ కార్యకర్తలు.

"నా వంతుగా .. లీటర్ పెట్రోలు తీసుకో .." చెప్పాడు కారువాలా.

## నేను రెడీ!



సర్కస్ జరుగుతోంది. స్టేజ్‌పైనున్న బోనులో ఒక అందమైన అమ్మాయి, సింహం ముద్దులాడుకుంటున్నారు.

"మీలో ఎవరైనా అలా చేయగలరా?" అరిచాడు రింగ్ మాస్టర్.

"సింహాన్ని బోనులోంచి తప్పిస్తే నేను రెడీ" అరిచాడు ప్రేక్షకుల్లో ఒకడు.

## రోజూ కనిపించకపోతే బాగుణ్ణు!

"హాయ్ డార్లింగ్, ఇల్లంతా ఇంత నీట్‌గా సర్దేశావు .. ఈ రోజు నీ ఫోన్లో వాట్సప్ పని చేయలేదా?" అడిగాడు అప్పుడే ఆఫీసునుండొచ్చిన భర్త.

"వాట్సప్ సంగతి దేవుడెరుగు. అసలు సెల్లే కనిపించక పోవడంతో దానికోసం వెతుకుతూ ఇల్లంతా సర్దేశాను .." చెప్పింది భార్య.

## ఛాయా'చిత్రం'




# ముద్రలు



బొమ్మ : అక్బర్




ఉదయాన్నే
ముంగిట ముగ్గులను
ఎగరేసుకుపోతున్న
రెక్కల మీద
ఎన్ని ముద్రలో ...

పరీక్షగా చూడండి
దుర్భిణీలూ
దివ్యదృష్టులూ అక్కరలేదు
మనోనేత్రాలు చాలు

లక్ష్మణరేఖకు భయపడి
చిరనిద్ర కప్పుకున్న వారి
సుమధుర కలల కాసారాలు
ఇంకిన వెన్నెల గుంతలు

పగలు ప్రవహించి
రాత్రి ముడుచుకుపోయే
వర్కింగ్ వుమెషీన్ల
ఘనీభూత హృదయ చిహ్నాలు

పెనమో, కణమో
పప్పో, నిప్పో
మంటశాలలో
పడగ గదో తెలీని,
కడిగిపారేసిన అంటులోనూ
అంటుకట్టని
ఆశల మోడింటి గేటు బయట
రంగవల్లుల్లో
తమను తాము దిద్దుకునే వారి
క్షోభా యాత్రల చారికలు

పరీక్షగా చూడండి
రెక్కలు తొడుక్కున్న
కలల ఖైదీల
దిగంత పయనాల దృశ్యాలు

- నిజం, murthy.nijam@gmail.com

## అనుగ్రహం

**5 -11 ఫిబ్రవరి 2017**

డాక్టర్ పి.ఎ.రామన్



**మేషం : అశ్వని, భరణి, కృత్తిక 1వ పాదం**

ఎదుటివారి గురించి ఉన్నతంగా ఆలోచిస్తారు, వారే మిమ్మల్ని అర్థం చేసుకోరు. రోజువారీ ఖర్చులే ఉంటాయి. ధనానికి ఇబ్బంది ఉండదు. ప్రముఖులతో సంప్రదింపులు జరుపుతారు. ఆలోచనలు కార్యరూపం దాల్చుతాయి. నూతన పెట్టుబడులకు అనుకూలం. పనులు, కార్యక్రమాలు వాయిదా వేసుకుంటారు. అవగాహన లేని విషయాల్లో జోక్యం తగదు. ఆరోగ్యం మెరుగుపడుతుంది. శుభకార్యానికి యత్నాలు ప్రారంభిస్తారు. ఒక సమాచారం ఉత్సాహాన్నిస్తుంది. కీలక పత్రాలు అందుకుంటారు.



**వృషభం : కృత్తిక 2,3,4; రోహిణి, మృగశిర 1,2 పాదాలు**

ధనలాభం, వస్తుప్రాప్తి. అసాధ్యమనుకున్న పనులు తేలికగా పూర్తవుతాయి. వేడుకలు, శుభకార్యాల్లో పాల్గొంటారు. మీ రాక బంధువులకు సంతోషాన్నిస్తుంది. చిన్నారులకు కానుకలందిస్తారు. సకాలంలో చెల్లింపులు జరుపుతారు. సంప్రదింపులకు అనుకూలం. మీ అభిప్రాయాలను కచ్చితంగా తెలియజేయండి. బ్యాంకు వివరాలను వెల్లడించవద్దు. అపరిచితులు మోసగించే ఆస్కారం ఉంది. మీ అలవాట్లు అదుపులో ఉంచుకోండి. దంపతుల మధ్య అన్యోన్యత నెలకొంటుంది.



**మిథునం : మృగశిర 3,4; ఆర్ద్ర, పునర్వసు 1,2,3 పాదాలు**

అన్ని రంగాల వారికి ప్రోత్సాహకరమే. ప్రయత్నపూర్వకంగా అవకాశాలు కలిసి వస్తాయి. మీ మాటతీరు ఎదుటివారిని ఆకట్టుకుంటుంది. వేడుకలను ఆడంబరంగా చేస్తారు. మీ ఉన్నతిపై కొంతమంది అపోహపడే ఆస్కారం ఉంది. ఆది, సోమ వారాల్లో పనులు మొండిగా పూర్తి చేస్తారు. కొన్ని విషయాలు ఊహించినట్టే జరుగుతాయి. ఉన్నత పదవులు స్వీకరిస్తారు. పరిచయాలు, గౌరవ ప్రతిష్ఠలు పెంపొందుతాయి.



**కర్కాటకం : పునర్వసు 4వ పాదం, పుష్యమి, ఆశ్లేష**

గృహమార్పు యత్నం ఫలిస్తుంది. మానసికంగా కుదుటపడతారు. ఆలోచనలు కార్యరూపం దాల్చుతాయి. కలిసివచ్చిన అవకాశాన్ని తక్షణం వినియోగించుకోండి. పనులు అస్తవ్యస్తంగా సాగుతాయి. మంగళ, బుధ వారాల్లో ఖర్చులు అధికం. రావలసిన ధనం అతికష్టంమ్మీద అందుతుంది. పోగొట్టుకున్న పత్రాలు పొందుతారు. ఆరోగ్యం, కుటుంబ విషయాల పట్ల శ్రద్ధ అవసరం. ఏ విషయాన్నీ తేలిగా తీసుకోవద్దు.



**సింహం : మఖ, పుబ్బ, ఉత్తర 1వ పాదం**

ఆర్థికంగా నిలదొక్కుకుంటారు. ఖర్చులు సామాన్యం. రుణ బాధలు తొలుగుతాయి. యత్నాలకు పరిస్థితులు అనుకూలిస్తాయి. ఇంటి విషయాలపై శ్రద్ధ వహిస్తారు. పనులు హడావుడిగా సాగుతాయి. గురు, శుక్ర వారాల్లో కావలసిన వ్యక్తుల కలయిక అనుకూలించదు. సంప్రదింపులు, వ్యవహారాలు కొలిక్కి వస్తాయి. శుభకార్యాల్లో మీ ఉన్నతిని చాటుకుంటారు. సంతానం ఆరోగ్యం మెరుగవుతుంది. పదవులు, బాధ్యతల నుంచి తప్పుకుంటారు. విలువైన వస్తువులు, పత్రాలు జాగ్రత్త.



**కన్య : ఉత్తర 2,3,4; హస్త, చిత్త 1,2 పాదాలు**

వ్యూహాత్మకంగా వ్యవహరిస్తారు. రావలసిన ధనం అందుతుంది. విలాసాలకు బాగా వ్యయం చేస్తారు. ఇంటా బయటా అనుకూలతలుంటాయి. శనివారం నాడు వ్యయ ప్రయాసలతో పనులు పూర్తి చేస్తారు. దంపతులకు కొత్త ఆలోచనలు స్ఫురిస్తాయి. ఆత్మీయులకు సాయం అందిస్తారు. ఒక సమాచారం ఉత్సాహాన్నిస్తుంది. పెట్టుబడులు, సంస్థల స్థాపనలకు అనుకూలం. భాగస్వామిక చర్చలు ఫలిస్తాయి. వ్యాపారాల్లో పురోభివృద్ధి, అనుభవం గడిస్తారు. నిరుద్యోగుల కృషి ఫలిస్తుంది.



**తుల : చిత్త 3,4; స్వాతి, విశాఖ 1,2,3 పాదాలు**

మీ సందేహాలు నివృత్తి అవుతాయి. ఆందోళన తొలగి కుదుటపడతారు. రోజువారీ ఖర్చులే ఉంటాయి. ధనానికి ఇబ్బంది ఉండదు. పరిచయస్తులు ధనసహాయం అర్థిస్తారు. పెద్దమొత్తం ధనసహాయం క్షేమం కాదు. మీ ఇష్టాయిష్టాలను సున్నితంగా తెలియజేయండి. ఆహ్వానాలు, కీలక పత్రాలు అందుకుంటారు. మీ ప్రమేయంతో శుభకార్యం నిశ్చయమవుతుంది. ఆది, సోమ వారాల్లో పనులు అతికష్టంమ్మీద పూర్తవుతాయి. మీ శ్రీమతి ఆరోగ్యం ఆందోళన కలిగిస్తుంది.



**వృశ్చికం : విశాఖ 4వ పాదం; అనూరాధ, జ్యేష్ఠ**

ఎదుటివారి వ్యాఖ్యలకు దీటుగా స్పందిస్తారు. అప్రయత్నంగా అవకాశాలు కలిసివస్తాయి. ఆకస్మిక ధనలాభం, వస్తుప్రాప్తి పొందుతారు. ఖర్చులు పెరిగినా ఇబ్బంది ఉండదు. చెల్లింపులు, చెక్కుల జారీలో జాగ్రత్త. ఒక శుభకార్యం నిశ్చయమవుతుంది. పనులు హడావుడిగా సాగుతాయి. స్వల్ప అస్వస్థతకు గురవుతారు. విశ్రాంతి అవసరం. మంగళ, బుధ వారాల్లో బాధ్యతలు, వ్యవహారాలు స్వయంగా చూసుకోవాలి. దంపతుల మధ్య దాపరికం తగదు. సంతానం విజయం సంతోషాన్నిస్తుంది.



**ధనుస్సు : మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1వ పాదం**

గృహమార్పు యత్నం ఫలిస్తుంది. చేపట్టిన పనులు సకాలంలో పూర్తి కాగలవు. శుభకార్యానికి యత్నాలు సాగిస్తారు. అనుకోకుండా ఒక అవకాశం కలిసి వస్తుంది. వేడుకలు, శుభకార్యాల్లో పాల్గొంటారు. వ్యవహారాలు మీ చేతుల మీదుగా సాగుతాయి. మీ గౌరవానికి భంగం కలుగకుండా వ్యవహరించండి. ఆది, గురు వారాల్లో చెప్పుడు మాటలు పట్టించుకోవద్దు. ప్రముఖులతో పరిచయాలు ఉన్నతిని కలిగిస్తాయి.



**మకరం : ఉత్తరాషాఢ 2,3,4; శ్రవణం, ధనిష్ఠ 1,2 పాదాలు**

నిర్దిష్ట ప్రణాళికలతో యత్నాలు ప్రారంభిస్తారు. అవకాశాలను తక్షణం వినియోగించుకోండి. ఎవరినీ సలహా అడుగవద్దు. సమర్థతతో రాణిస్తారు. ఖర్చులు విపరీతం. ఆదాయ మార్గాలు అన్వేషిస్తారు. ఆత్మీయుల సాయంతో ఒక సమస్య సానుకూలమవుతుంది. పనులు మొండిగా పూర్తి చేస్తారు. మంగళ, శని వారాల్లో ప్రముఖుల ఇంటర్వ్యూ కోసం పడిగాపులు తప్పవు. వ్యవహార ఒప్పందాలకు అనుకూలం.



**కుంభం : ధనిష్ఠ 3,4; శతభిషం, పూర్వాభాద్ర 1,2,3 పాదాలు**

ఆదాయ వ్యయాలు సంతృప్తికరం. గృహమార్పు కలిసివస్తుంది. సన్నిహితులకు చక్కని సలహాలిస్తారు. ప్రభుత్వ కార్యాలయాల్లో పనులు సానుకూలమవుతాయి. ప్రియతములతో ఉల్లాసంగా గడుపుతారు. స్వల్ప అస్వస్థతకు గురవుతారు. అతిగా ఆలోచింపవద్దు. విశ్రాంతి అవసరం. అవగాహన లేని విషయాల్లో జోక్యం తగదు. గురు, శుక్ర వారాల్లో మీపై శకునాల ప్రభావం అధికం. దంపతుల మధ్య అవగాహన లోపం, చికాకులు తలెత్తుతాయి. సౌమ్యంగా సమస్యలు పరిష్కరించుకోవాలి.



**మీనం : పూర్వాభాద్ర 4వ పాదం, ఉత్తరాభాద్ర, రేవతి**

పెట్టుబడులు, పొదుపు పథకాలకు అనుకూలం. ఆదాయం ఫర్వాలేదనిపిస్తుంది. ఖర్చులు భారమనిపించవు. చెల్లింపులు, నగదు స్వీకరణలో జాగ్రత్త. నిర్దిష్ట ఆలోచనలతో ముందుకు సాగుతారు. ప్రయత్న పూర్వకంగా అవకాశాలు కలిసివస్తాయి. శనివారం నాడు ఒకేసారి అనేక పనులతో సతమతమవుతారు. కావలసిన వ్యక్తుల కలయిక సాధ్యం కాదు. మీపై శకునాల ప్రభావం అధికం. అవివాహితులకు శుభవార్తా శ్రవణం. బంధుత్వాలు, పరిచయాలు ఉన్నతికి దోహదపడతాయి.

## అవునా!



1979 ఫిబ్రవరి 18న సహారా ఎడారిలో 30 నిమిషాల పాటు మంచు కురిసింది.

b ప్రఖ్యాత పాప్‌సింగర్ మడొన్నాకి గారో ఫోబియా (ఉరుములంటే భయం) ఉంది.

b స్విట్జర్లాండ్‌లో సైన్స్‌డేని మన మాజీ రాష్ట్రపతి ఎ.పి.జె. అబ్దుల్ కలాం పేరిట చేసుకుంటున్నారు.



మంచు చిరుత పులులు గాండ్రించలేవు.

b పౌండ్లను ఎల్‌బిఎస్ అని సంక్షిప్తంగా రాస్తారు. ఇందులో ఎల్‌బి అనేది లాటిన్ పదం 'లిబ్రా'కు సంక్షిప్తం. లిబ్రా అంటే పౌండు అని అర్థం.

b పుట్టినపుడు ఆక్టోపస్ గోమారు (చిన్న పురుగు) అంత ఉంటుంది.



అంగారక గ్రహంపై సూర్యాస్తమయం నీలి రంగులో కనిపిస్తుంది.

b ఆండ్రాయిడ్ వెర్షన్స్‌కి పేర్లు ఇంగ్లీషు అక్షరక్రమం ప్రకారం పెడుతున్నారు. ఆ వరుసలో ఇప్పటిదాకా వచ్చినవి - Astro, Bender, Cupcake, Donut, Eclair, Froyo, Gingerbread, Honeycomb, Ice Cream Sandwich, Jelly Bean, KitKat, Lollypop, Marshmallow and Nougat.

# అదృష్ట రత్నజ్యోతి


## రమేశ్చంద్ర మహర్షి

సెల్ : 92465 82255, ఫోన్ : 040-6522 5554


**పి.ఎస్.ఆర్., హైద్రాబాద్**

**మా మనవరాలి జన్మకుండలి సంపూర్ణంగా, నిర్మొహమాటంగా వివరించగలరు.**

ఈ జన్మకుండలి ప్రకారం-

**యోగాలు** : బుధాదిత్య యోగం. ఇక్కడ రాజయోగంలా పనిచేస్తుంది. ఆస్తులు ఏర్పడడానికీ, సంతానానికీ, పూర్వపుణ్యం ఆయా సమయాల్లో అక్కరకు రావడానికీ పనిచేసే యోగం ఇక్కడ!

ఈ జన్మకుండలిలో రాజయోగం, ధనయోగం, వాహన యోగం, వృత్తి పరంగా అధికార యోగం అన్నీ అడగకపోయినా వచ్చి ఒదిగిపోయే యోగాలు. అయితే దుర్లభమైన అంశం వివాహం, దానిలో కలిసి ఉండడం, పైన చెప్పుకున్న బుధుని కంట్రోల్ చేస్తున్న కుజుని పోర్ట్‌ఫోలియో... సంతానం కలగడం తరువాయి... భార్యాభర్తలు విడిపోవడం జరుగుతుంది.

23వ సంవత్సరంలో... అంటే శనిలో కుజునిలో కళ్యాణ ఘడియలు ఉన్నా చేయకూడదు. జరిగితే విడిపోతారు.

ఇక 24, 25 సంవత్సరాల్లో... అంటే శనిలో రాహువులో కళ్యాణ ఘడియలు. తప్పించేవి కాదు. కనుక వివాహం... ఒక డాక్టర్‌తో!

ఈ రాహుభుక్తిలో భార్యాభర్తలు విడిపోకుండా పరిహారాలు పాటించాలి.

మళ్ళీ 29 నుండి 31 మధ్య... అంటే బుధునిలో బుధుడు. కుజుని ప్రభావం వలన విడాకులు అనివార్యం. పరిహారాలు కూడా పనిచేయవు.

శనిలో రాహువుకీ, బుధునిలో బుధునికీ మధ్య... అంటే శనిలో గురువులో సంతానం.

బుధ దశ ప్రారంభమయ్యేది 2041 నుండి. అది నడిచేది 17 సంవత్సరాలు. అయితే బుధ దశ మొత్తం అంటే 29 నుండి 46 సంవత్సరాల వయసు వరకూ వైవాహిక జీవితాన్ని ఇవ్వవలసిన కుజుడు ఇవ్వడం లేదు. నీచపట్టిన రాహువు మాత్రం కాంజుగల్ లైఫ్ ఇస్తున్నాడు. అంటే... 26 ఏళ్ళ తర్వాత విషయం కనుక... అప్పటి సామాజిక పరిస్థితుల్ని అర్థం చేసుకోగలరన్న నమ్మకంతో వ్రాస్తున్న విషయం... బుధ దశ 'లివింగ్ టుగెదర్'ని చూపిస్తోంది. బుధ, కుజ, రాహు, కేతువులకు గట్టి రెమిడీస్ పాటిస్తే ఈ సమస్య ఉత్పన్నం కాకుండా కాపాడుకోవచ్చు.

ఇక్కడ శుక్రుడు ఉచ్ఛపట్టిన శనిలా పనిచేయడం, శని, రవి, రాహు, కుజుల మధ్య స్థితి పొందడం వంటి కాంబినేషన్ వలన ఈమె విజయవంతమైన వైద్యురాలు! వృత్తిలో అసాధారణమైన స్థితి, గొప్ప పేరూ ఈమె స్వంతం! బుధ దశ మొత్తం వృత్తిలో అనితర సాధ్యమైన విజయాలు నమోదు చేసుకునే పరిస్థితి ఉన్నా, తిరిగి కేతు దశలో... అంటే తన 46 నుండి 53వ సంవత్సరం మధ్య ఏదో అంతుబట్టని విరక్తి కమ్ముకోకుండా రెమిడీస్ పాటించాలి. ఈ దశలో విజయం, కీర్తి ఆగిపోయినా, రవి శనుల కారణంగా అవనతం కాకుండా ఆగుతాయి. తిరిగి శుక్ర దశలో... అంటే తన 53 నుండి 73వ సంవత్సరం మధ్య కేతువుకు గట్టి రెమిడీస్ పాటిస్తే యోగిస్తుంది.

ఏ జన్మకుండలినైనా లగ్నంలో గురువుంటే అదో అమోఘమైన కాంబినేషన్ అని అనుకోవడం కద్దు. అయితే అదే బృహస్పతి అష్టమాధిపతి అయినప్పుడు అందం ఇస్తాడు తప్ప లగ్న గురుడిచ్చే అదృష్టం ప్రసాదించలేడు. అష్టమంతో సంబంధం కలిగిన గురునిది ఆధిపత్యం కానీ, స్థితి ప్రకారం కానీ భాగ్యప్రాకారాన్ని సృష్టించలేని పరిస్థితి అవుతుంది!

ఇక స్థిరచరాస్తులు చాలా. సంతానం సంఖ్య 1.

ధరించాల్సిన రత్నం కెంపు. వివాహం ప్రేమ వివాహం. కుజదోషం 70 శాతం. విదేశయానాలు తక్కువ. ఒక కనిష్ట సోదరి. తాను ప్రథమ సంతానం. ఏలినాటి శని పెద్దగా బాధించదు. నాస్తికత్వానికీ ఆస్తికత్వానికీ మధ్య అలాగే విరాగానికీ సరాగానికీ మధ్య నిరంతరం కొనసాగే కాన్‌ఫ్లిక్ట్! చివరికి జయించేది మాత్రం వేదాంతమే! తన 72వ ఏట నుండి రవి దశ మొత్తం చారిటీలకు పనిచేయడం, సహాయం చేయడం, ఉచిత వైద్యం, వీటితోనే గడిచిపోతుంది!

**ఈ వారం కథ**

# పిరమిడ్

పాపినేని శివశంకర్

## తొలి దృశ్యం

**స్థలం : ఒక కొండ.**
**పాత్రలు : కొండెక్కుతున్న ఇద్దరు స్నేహితులు.**
**విషయం : విభిన్న ఆసక్తులు.**

మనిషి కొండనెక్కటం ఒక సంకేతమైతే అది తన జీవితంలో ఉన్నత స్థానానికి చేరే ప్రయత్నం అనుకోవచ్చు. అదేమోగాని చిన్నప్పటి నుంచి కొండలెక్కటం సరదా నాకు... స్నేహితుల్తో కలిసి.

చదువుకునే రోజుల్లో ఒకసారి బాల్య స్నేహితుడితో పాటు ఒక కొండనెక్కాను. ఎక్కటానికి ఒక వీలు, వాలు ఏమీ లేదు. రాళ్ళు రప్పల మీదుగా, తుప్పల పక్కగా, ఏటవాలు రాతి పలకల మీదుగా, పట్టు చిక్కించుకుంటూ మెల్లగా పైకి చేరటమే.



బొమ్మలు : **చారి పి.యస్.**

కొండ నెక్కినాక మనస్సు విశాలం కావటం గమనించాను. నా ఆరాటాలన్నీ కొండ మొదట్లోనే వదిలేసినట్టు, జ్ఞాన బంధనాల నుంచి, కోర్కెల బంధనాల నుంచి విముక్తమైనట్టు, ప్రకృతిని మానవ ప్రకృతిని ఇంతకుముందు కంటే మరింతగా ప్రేమించగలిగినట్టు అనిపించింది. అయితే నా సహచరుడికి ఆ విధంగా తోచలేదు. "నేనొక్కణ్ణే ఈ కొండనెక్కి ఉంటే ఇంకా సంతోషించేవాణ్ణి" అన్నాడు ఏమాత్రం మొహమాటం లేకుండా. దిమ్మెరపోయాను. దాని భావం దబ్బున అంతుబట్టలేదు.

'ఏదైనా తను మాత్రమే అధిరోహించాలని, అందరికన్నా ఎంతో ఎత్తుగా కనపడాల'ని చెప్పాడు ఆ ఐదున్నర అడుగుల మిత్రుడు. కిందికి దిగుతూ "బాగా ఏటవాలుగా అందంగా ఉందీ కొండ" అన్నాడు. అతని మొహంలో నల్ల మబ్బేదో ముసరబోతోందని అర్థమైంది.

## మలి దృశ్యం

**స్థలం : బ్రహ్మాండమైన ఫ్లై ఓవర్.**
**పాత్రలు : దాని మీద ఇద్దరు, స్నేహితులు.**
**విషయం : అతని ఆశయం.**

తన మాటల లోతెంతో అతనప్పటికే నిరూపించాడు. బి.టెక్ పూర్తి కాగానే నేను ఒక కంపెనీలో కెమికల్ ఇంజనీర్గా సెలెక్ట్ అయ్యాను. అతను కాలేదు. ఎం.టెక్ పూర్తి చెయ్యబోతూ మధ్యలోనే మానేసి తనకు సరైన దారేదో ఎంచుకొన్నాడు. తండ్రి దివాలా తీసిన వ్యాపారస్తుడు. తండ్రి విఫలమైన చోటే విజయం సాధించాలనుకొని ఉంటాడు. అప్పటికి నా మాదిరిగా పుస్తకాలు విరివిగా చదివే అలవాటు పోయింది అతనికి. చిన్న చిన్న కాంట్రాక్టు పనుల నుంచి వంతెనలు, భవనాల కట్టుబడి దాకా ఎదగటం చూశాను. తాజా కాంట్రాక్టు పని - ముంబయిలో ఒక ఫ్లై ఓవర్ నిర్మాణంలో ఉండగా ఉద్యోగ బాధ్యతల్లో భాగంగా నేనటు వెళ్ళాను. అతను కళేబరంలా ఉన్న ఆ నిర్మాణం పై భాగానికి నన్ను తీసుకెళ్ళాడు.

"దీని ఎత్తు సెంటర్ పాయింట్లో పది మీటర్లు. ఇంత పెద్ద కన్స్ట్రక్షన్ ఈ ప్రాంతంలో ఎక్కడా లేదు. నిజానికి ఈ ఎత్తు నాకు చాలదు. ఎప్పటికైనా అప్పుడు మనమెక్కామే, ఆ కొండంత ఎత్తుకు ఎదగాలి" అన్నాడు ఐదున్నర అడుగుల ఎత్తున్న నా మిత్రుడు.

ఎదుగుదలని అతను స్కేళ్ళతో, చెక్కుల్తో, లాభాల్తో కొలుస్తున్నాడని, తానెక్కిన కొండలాంటి ద్రవ్యరాశినేదో పేర్చుకుంటూ ఒక పిరమిడ్ నిర్మాణం చెయ్యటం అతని అసలు లక్ష్యమనీ నాకర్థమైంది. ఆ భావం అతని నోటివెంటే మరో రకంగా విన్నాను.

"నిట్టనిలువు బహుళ అంతస్తుల భవనాల కంటె ఇలాంటి ఏటవాలు నిర్మాణాలే నా కిష్టం."

అతని మొహంలో ఒక నల్లమబ్బు తారట్లాడటం గమనించాను. అలా అలా వంతెన కింద చాలా నీరు ప్రవహించింది.

## మూడో దృశ్యం

**స్థలం : ఒక చిన్న ఇల్లు.**
**పాత్రలు : ఇద్దరు మనుషులు, మధ్య ఒక పెట్టె.**
**విషయం : ఋజువు.**

ఒక మనిషికి మరో మనిషి మీద నమ్మకం ఏర్పడటానికి ఏదైనా ఒక ఋజువు కావాలి. అట్లా ఒకానొక సందర్భంలో అతను నన్ను 'ఋజువు' చేసుకొన్నాడు. 'వెళ్తూ వెళ్తూ' అతను రెండడుగుల పొడుగు, అంతే వెడల్పు, అడుగున్నర ఎత్తున్న ఒక పెట్టెను మా ఇంటికి తెచ్చాడు. డ్రైవర్ లేకుండా కార్లో ఒంటరిగా వచ్చాడు. కారు డిక్కీలో నుంచి అంత పెద్ద పెట్టెను కష్టంగా మోసుకొస్తుంటే జీవితంలో అతను పడిన

పెద్ద శ్రమ అదేనేమో అన్పించింది. పెట్టె పైన కాస్త ఏటవాలుగా పిరమిడ్ లాంటి చెక్కడం ఉంది.

“నేను తిరిగి వచ్చేదాక దీన్ని నీ దగ్గరే భద్రంగా ఉంచాలి” అని చెప్పాడు. “ఇది నా ప్రాణంతో సమానం” అన్నాడు మళ్ళీ.

అందులో ఏముందో చెప్పలేదు. తెలుసుకోవాలనే ఆసక్తి లేదు నాకు. బాల్య స్నేహితుడికి చిన్న సాయం, అంతే. నెలన్నర తర్వాత అతను తిరిగి వచ్చినపుడు ఆ పెట్టెను భద్రంగా అప్పజెప్పాను. ఆత్రంగా అందుకొన్నాడు.

“ఇందులో ఏముందో ఇప్పటికీ తెలుసుకోవాలన్పించడం లేదా?” అని అడిగాడు. తల అడ్డంగా ఊపాను. “ఇరవై కిలోల బంగారం, ఇంకా వజ్రాలు అవీ ఉన్నాయి. ఏదో దాడి జరగబోతోందని రూఢిగా తెలిసింది. నీకన్న భద్రమైన ప్రదేశం నాకు కన్పించలేదు” చెప్పాడతను చిరునవ్వుతో.

ఆ నవ్వులో వేరే అంతరార్థం కూడా ఉందనిపించింది. నన్ను నమ్మటంలో సరైన నిర్ణయం తీసుకున్నాననేది ఆ సంతోషానికి కారణమై ఉండాలి.

“నువ్వు నమ్మదగిన ఫ్రెండువని ఋజువు చేసుకున్నావు” మళ్ళీ అదే నవ్వు.

అతనికా విధంగా ఉపయోగపడి నన్ను నేను ఋజువు చేసుకొన్నందుకు కించపడ్డాను. నా మొహం జేవురించటం అతను గుర్తించలేదు. వెళ్ళబోతూ అందమైన చిన్న బాక్సులో రెండు వజ్రాలు పెట్టి ఇవ్వబోయాడు. తిరస్కరించాను. తన నమ్మకాన్ని నిలబెట్టుకొన్నందుకు ప్రతిఫలం తీసుకోవటం అగౌరవం.

సరికొత్త నిర్మాణాల ద్వారా త్వరత్వరగా పైకి వెళ్తున్నట్టు, ఇంకా తొందరగా శిఖరం చేరాలనుకుంటున్నట్టు తన మాటల్లోనే తెలిసింది. ఏటవాలు నిర్మాణాల్లో జారిపడే ప్రమాదం ఉంటుందని చెప్పాను. నవ్వాడు.

అయితే అప్పటి నుంచి అతను తన జీవనయానంలో నాకో ప్రత్యేక స్థానం ఇస్తున్నాడని అర్థమైంది. అతను తన నిర్మాణంలో పైపైకి వెళ్ళేకొద్దీ అభద్రంగా తలపోస్తూ ఉండొచ్చు. ప్రమాదరహితంగా సాగటానికి తన నమ్మకాన్ని ఋజువు చేసుకొన్న వ్యక్తులు చాలా అవసరమని తోచి ఉండొచ్చు. పైపైకి వెళ్ళేకొద్దీ పతన భయం పెరుగుతుందనేది సాధారణ సూత్రం.

**“ఇందులో ఏముందో ఇప్పటికీ తెలుసుకోవాలన్పించడం లేదా?” అని అడిగాడు. తల అడ్డంగా ఊపాను. “ఇరవై కిలోల బంగారం, ఇంకా వజ్రాలు అవీ ఉన్నాయి. ఏదో దాడి జరగబోతోందని రూఢిగా తెలిసింది. నీకన్న భద్రమైన ప్రదేశం నాకు కన్పించలేదు” చెప్పాడతను చిరునవ్వుతో.**

**ఆ నవ్వులో వేరే అంతరార్థం కూడా ఉందనిపించింది. నన్ను నమ్మటంలో సరైన నిర్ణయం తీసుకున్నాననేది ఆ సంతోషానికి కారణమై ఉండాలి.**

## నాలుగో దృశ్యం

**స్థలం : ఒక మహాద్భుత విశాల భవనం.**
**పాత్రలు : ఒకానొక దేవకన్య,**
**ఇద్దరు స్నేహితులు**
**విషయం : ఐశ్వర్యం.**

అతను తన నూతన భవనంలో ఒక ఉత్సవానికి ఆహ్వానించినప్పుడు ఆశ్చర్యపోయాను. అప్పటికే మూడు భవనాలుండగా నాలుగో దాని అవసరమేమిటి? అదే అడిగాను.

నవ్వాడు. నా ప్రశ్నకి జవాబు దొరకలేదు. అయితే తక్కిన సంగతుల ద్వారా అర్థమైంది. ఏ వంద కార్లలోనో దిగిన అతిథుల్ని పలకరిస్తూ, పనివాళ్ళను పురమాయిస్తూ అజమాయిషీ చేస్తున్న ఒకానొక చక్కని పడుచుదనం నా కళ్ళబడింది. ఆమెను దేవకన్యగా పరిచయం చేశాడు. ఆ దేవేంద్ర భవనం ఆ ‘దేవకన్య’ కోసమే అని, ఆ రోజు ఆమె పుట్టినరోజని రూఢి అయ్యింది. అట్లా రూఢి కావటానికి ఆ ఫంక్షన్‌లో ఎక్కడా అతని భార్య కనపడకపోవటం ఒక కారణం. భార్యే కాదు, ఒక్కగానొక్క కొడుకు జాడ కూడా లేదు.

నిజానికి అతని భార్య అటువంటి పార్టీల్లో ప్రధాన మహిళగా ఎప్పుడూ కనపడేది కాదు. అప్పుడప్పుడు నాతో చెల్లెలిలాగా ఆప్యాయంగా మాట్లాడేదంతే. ఆ గొంతులో అపార సంపదకి తను రాణిననే స్పృహకి బదులు ఆ సంపద బరువు తనని కుంగదీస్తున్న స్ఫురణే ఉండేది. ఒంటిమీద ఒకటో అరో తప్ప నగలుండేవి కావు. వీలైనంత వరకు ఒంటరిగానే ఉండటానికి ఇష్టపడేది. వాళ్ళ ఇంటికి నేను వెళ్ళినపుడు చాలాసార్లు ఆమె పూజామందిరం నుంచే రావటం గమనించాను. బహుశా ఏదో ఉపశాంతిని అక్కడ కోరుకుంటోందేమో!

ఇటలీ నుంచి దిగిన పాలరాళ్ళతో, బెల్జియం అద్దాలతో, వెనీషియన్ షాండిలియర్లతో, ఫ్రెంచ్ కళాకౌశలాన్ని తలపించే అత్యంత ఖరీదైన ప్రాసాదం అదని అతిథులంతా అతణ్ణి ప్రశంసల్లో ముంచెత్తారు. ‘దేవకన్య’ తన చెయ్యి సుతారంగా పట్టుకోగా అతను అతిథులందర్నీ గదిగదికీ తిప్పి చూపించాడు. మొత్తం ముప్పయ్యారు పడకగదులున్నాయి. తమ నగ్నతను కన్నారా తిలకిస్తూ చెయ్యగల స్నాన మందిరాలున్నాయి. అతనివెప్పుడూ బ్రహ్మాండమైన నిర్మాణాలే.

“నీ అష్టాంగాలు విడివిడిగా ఒక్కో గదిలో పడుకున్నా ఇంకా చాలా మిగిలిపోతాయి” అన్నానతనితో సరదాగా. నన్ను అమాయకుడిని చూసినట్టు చూశాడు.

“ఒక్కోసారి విదేశాల నుంచి అతిథులు ఎక్కువగా వస్తారు గదా? అందుకని.”

చిత్రంగా ఆ ఉత్సవంలోనే అతనొక విలక్షణ ప్రకటన చేశాడు, ఫలానా గ్రామాన్ని దత్తత తీసుకుంటున్నానని. ఆ గ్రామం అభివృద్ధి కోసం తానేం చెయ్యబోతున్నాడో వివరిస్తుంటే ఆ పెద్ద హాలంతా చప్పట్లతో మారుమోగిపోయింది. అతనందరికీ ఐదున్నర అడుగుల కంటే ఎత్తుగా కనపడుతున్నాడని నాకు తోచింది. ఆ గ్రామం పేరు నేనింతకు ముందెప్పుడూ వినలేదు. అంత మంచి పని చేస్తున్నందుకు అభినందించి, ఆ గ్రామం ఎక్కడుందని ఎవరో అడిగారు.

“నో ఐడియా. మా పి.ఏ ఏదో చెప్పాడు, ఓకే అన్నాను” చెప్పాడతను తేలిగ్గా.

ఆ ఊరిమీద, అక్కడి జనం మీద మమకారం లేకుండా ఎందుకతను దత్తత తీసుకుంటున్నాడు? సమాజానికి తానేదో చేస్తున్నాననే భావన కోసమా? ఏదో చేస్తున్నట్టు సమాజం నమ్మే ప్రచారం కోసమా? రకరకాల మధువులతో సాయంత్రపు విందు అయినాక అతిథులంతా అభినందనలతో సెలవు తీసుకొనేటప్పుడు ప్రత్యేకంగా నన్ను మాత్రం ఉండమన్నాడు.

‘దేవకన్య’ అప్పటికే బాగా అలిసిపోయినట్టుంది. ఫంక్షన్ జరిగినంతసేపు ఆమె నవ్వుతూ తుళ్ళుతూ అటు ఇటు తిరుగుతూనే ఉంది. అన్ని గంటలసేపు ఏమాత్రం విరామం లేకుండా నవ్వగలగటం ఎంతో అభ్యాసంతో తప్ప రాదు. ఒకసారి అది పెదాల చివర్లు సాగదీసిన నవ్వు. మరోసారి పలువరస కనపడే నవ్వు. ఇంకోసారి కిలకిల నవ్వు. వేరొకసారి విరగబాటు నవ్వు. ఏ సందర్భంలోను ఆమె తన అలంకరణ, శిరోజాల సవరింపు మర్చిపోలేదు. ఒక స్త్రీ అన్ని ఖరీదైన నగలు ఒంటిమీద మొయ్యగలదా అన్పించేటంతగా

వజ్రహారాలు వేసుకుంది. ఆమె కదలికల్లో నాట్యభంగిమలు చూసి అతిథులంతా ఆకర్షితులయ్యారనటంలో సందేహం లేదు. నాకు మాత్రం ఆమె ఒక గాజుబొమ్మ అని, చాలా జాగ్రత్త అవసరమని, చిన్న తాకిడికే చిట్లిపోతుందని - ఇట్లా ఏవేవో పిచ్చి ఆలోచనలు కలిగాయి. కాని గాజుబొమ్మలు తమంత తాముగా అదృశ్యమైపోగలవని ఆలస్యంగా తెలిసింది.

"ఇతరులెవ్వరికీ తెలీని అద్భుతం నీకు మాత్రమే చూపిస్తా, రా" అంటూ అతను నా చెయ్యి పట్టుకొని లాక్కెళ్ళాడు. అప్పటికి 'దేవకన్య' విశ్రమించటానికి వెళ్ళింది. పనివాళ్ళు హాలు సర్దటంలో మునిగిపోయ్యారు. ఆ మహాభవనంలోని ఏయే గదుల్లోంచి, మలుపుల్లో నుంచి, మూల దారుల్లో నుంచి తీసుకెళుతున్నాడో గమనించే లోపే ప్రపంచంలోని అత్యంత సుందరమైన ఒకానొక నేలమాళిగలో నేనున్నానని గ్రహించాను. అది పూర్తి చీకటీ కాదు, పూర్తి వెలుతురూ కాదు. కలా కాదు, భ్రాంతీ కాదు. అద్భుతం, అంతే.

అర్ధనగ్న, పూర్ణనగ్న సాలభంజికల్తో, అలంకరింపబడ్డ ఆ విశాలమైన గుండ్రని గదిలో చాటునున్న ఒక మీట నొక్కి ఏమాత్రం కనిపెట్టలేని ఒక తలుపు తెరిచాడు. నా కళ్ళు మిరుమిట్లు గొలిపాయి. అందులో పెద్ద పెద్ద అరలు. అరల్లో పసిడివన్నె దిమ్మెలు అన్నీ ఏటవాలుగా పైకి పేర్చి ఉన్నాయి. అన్నిటికన్నా పైన ఒకే ఒక చిన్న దిమ్మె విలాసంగా, గర్వంగా కూర్చుని ఉంది. అది అతనికిష్టమైన నిర్మాణం. వజ్రాలు అతనికి బాగా ఇష్టం లా ఉంది, ఒక పెట్టె నిండా ఎన్నో కారెట్ల విలువ గలవి మెరుస్తున్నాయి. కారెట్ మాజిక్ నెంబర్ గలవి కూడా - నాకు తెలీకపోయినా - చూపించాడు. ఇంకా రకరకాల రత్నాలు వేర్వేరు పెట్టెల్లో రాసి పోసి ఉన్నాయి. మరకతాలు ఎక్కువ. మరికొన్ని అరల్లో దొంతరలు దొంతరలుగా సరికొత్త నోట్ల కట్టలు. ఆ మార్మిక ప్రదేశం ఏదో వింతవాసనతో సొక్కిపోతోంది. బహుశా ఐశ్వర్యవాసనేమో.

"ఎవరికీ అనుమానం రాకుండా ఈ నేలమాళిగను నిర్మించటానికి ఏడాది పట్టింది. బ్రహ్మదేవుడు కూడా దీన్ని కనుక్కోలేడు." అతని గొంతులో వింత విలాసం తొణికిసలాడింది.

అయితే ఆ రహస్య ప్రదేశాన్ని, అందులోని తన గూఢ సంపదని నాకెందుకు వెల్లడించాడో అర్థం కాలేదు. అది కేవలం అతని నమ్మకాన్ని నేను ఋజువు చేసుకున్నందువలన కాదు. తను అనంత ఐశ్వర్యవంతుడిననే సంగతి ప్రపంచంలో ఏ ఒక్కరితోనైనా పంచుకోకపోతే అతని ఆరాటం తృప్తి పడదేమో. మరో కారణం కూడా ఉందని తర్వాత బోధపడింది.

"పాలీహెడ్రాన్ నిర్మాణాలంటే ఇష్టపడే నువ్వు ఈ సిలిండ్రికల్ నిర్మాణంలోకి దిగావేంటి? ఆ ఎత్తు, ఈ లోతు పరస్పరం విరుద్ధమైనవి కదా? ఇది సరైంది కాదు" అన్నాను ఉండబట్టలేక. నా మాటల లోతు



తెలీని వాడేమీ కాదతను. అయినా పట్టించుకోలేదు. నవ్వి ఊరుకున్నాడు.

"ఇది వెయ్యేళ్ళు తిని కూర్చున్నా తరిగిపోని సంపద. ఏం చేసుకుంటావు?"

నా ప్రశ్నకు జవాబివ్వకుండా "వెయ్యేళ్ళు వర్ధిల్లమని కోరుకో" అన్నాడు పెద్దగా నవ్వుతూ. అంతలోనే అది రహస్య ప్రదేశమనే స్పృహతో ఆపేశాడు.

"దీనికోసం రాత్రింబగళ్ళు చెమటోడ్చా" అన్నాడు. నవ్వొచ్చింది.

నావల్ల తనకేమీ ప్రమాదం లేదనే ఋజువైన నమ్మకంతో కావచ్చు, ఆ 'చెమటోడ్చిన' వైనం టూకీగా చెప్పుకొచ్చాడు. ఏ ఉద్యోగం లేని దశ నుంచి భవన నిర్మాతగా, బడా కాంట్రాక్టర్‌గా, పిరమిడ్ హోటల్స్ గ్రూప్ అధినేతగా అతను అంచెలంచెలుగా ఎదిగిన సంగతి నాకు తెలుసు. విదేశాల్లో అతనికి కంపెనీలు కాని కంపెనీలేవో ఉన్నట్టు తెలిసింది. కొడుకు తన మాట వినటం లేదని చెప్పి, తన పనుల్లో నన్ను తోడుగా ఉండమని, లాభాల్లో నాలుగో వంతు ఇస్తానని అడిగాడు. తల అడ్డంగా ఊపాను. "నేలమాళిగల్లో ఊపిరాడదు నాకు."

నాకు నచ్చకపోయినా అదంతా కచ్చితంగా అతని విలక్షణ మేధాశక్తే. ఆ శక్తితో అతను ఎవరినైనా, దేన్నైనా (కనీసం కొంతకాలం) ఏమార్చగలడన్పించింది. కాని తన మొహాన్ని అలముకొంటున్న నీలిమబ్బును ఎప్పటికైనా పారదోలగలడా?

అంత అందమైన నేలమాళిగను నిర్మించగలిగిన అతను ఒక సంగతి ఎందుకు గుర్తించలేకపొయ్యాడో అర్థం కాలేదు. అదే అడిగాను.

"ఈ గదిలో వ్యాపించిన నీలవలయం సంగతేమిటి?"

ఆశ్చర్యంతో అతని కనుబొమలు ముడివడ్డాయి. "నీలవలయమా? అదెక్కడ?" అంటూ చుట్టూ చూశాడు. "లేదు లేదు" అన్నాడు తొందరగా.

నాకంత స్పష్టంగా కనపడుతున్న ఆ కారునలుపు వలయం, మెలికలు తిరుగుతున్న వలయం అతనికెందుకు కనపడలేదు?

"ఏ మెలికలూ నువ్వు గమనించలేదా? కారు నలుపు, అమావాస్య నలుపు. దీన్నుంచి నువ్వు బయటపడితే సంతోషిస్తా."

"అమావాస్య అంటావేమిటి? ఇవాళ పౌర్ణమి" నా మాటను ఖండిస్తూ అతను.

"చీకటిలో నీకది కన్పించకపోయుండొచ్చు. పోనీ ఆ బుస అయినా వినపడుతోందా?"

విసుగ్గా తల విదిలించాడు. "దట్స్ ఎనఫ్. పద, బయటికెళ్దాం."

ఇంటికి వెళ్తుండగా నింగిలో నిజంగానే నిండు చందమామ. కానీ అక్కడ మాత్రం అది నిశ్చయంగా అమావాస్యే.

## ఐదో దృశ్యం

**స్థలం : స్నేహితుడి ఇల్లు.**
**పాత్రలు : అతని భార్య, నేను.**
**విషయం : వేదన.**

ఆమె నాకు అతని భార్యగానే పరిచయం. కాలక్రమంలో నన్ను సోదరసమానంగా అభిమానిస్తున్నదని గ్రహించాను. ఒక చెల్లెలు తప్ప అన్నదమ్ములు లేరామెకి. ఎప్పటిలా ఆమె పూజామందిరంలో నుంచే హాల్లోకి వచ్చింది.

విషాదమేదో గూడు కట్టుకొని ఉంది ఆమె మొహంలో.

“వాడు ఇంటి నుంచి వెళ్ళిపోయాడు” చెప్పింది ఏ ఉపోద్ఘాతం లేకుండానే.

అది కొడుకు సంగతి. ఎందుకని అడిగాను.

“తండ్రీ కొడుకులకి చాన్నాళ్ళ నుంచి సరిపడటం లేదు. తన వ్యాపారాలకు అండగా ఉండమని ఆయన ఒత్తిడి. ఆ పద్ధతులేవీ వాడికి నచ్చటం లేదు. నిన్న పెద్ద ఘర్షణే జరిగింది. మాట వినని కొడుకు నాకెందుకని ఆయన. దారి తప్పిన తండ్రి తనకీ అవసరం లేదని వాడు వెళ్ళిపోయాడు. వాళ్ళవి కోపాలు. నాది వేదన.”

చిన్న అభిప్రాయభేదానికే అంత దూరం ఎందుకెళ్ళారని అడిగాను. ఆ లోతుపాతులు తనకు తెలీవని చెప్పింది. కొడుకు ఆరోపణల్లో హవాలా, మనీలాండరింగ్, ఫారిన్ సూట్‌కేస్ కంపెనీ, నలుపు తెలుపు మొదలైన మాటలు దొర్లినట్టు, అందువల్ల అదేదో తీవ్రమైన విషయమే అనుకొంటున్నానని చెప్పింది. నేలమాళిగలు అందుకే అతనికి అవసరమైనట్టు గ్రహించాను. వెళ్తూ వెళ్తూ కొడుకు తనతో అన్న మాటలు ఆమెను కల్లోలపరిచాయని చెప్పింది.

“అమ్మా! రోజురోజుకీ నల్లగా మారుతున్న వ్యక్తికి కొడుకుగా ఉండటం నా సమస్య. దానికి ఇవాళ్టితో పరిష్కారం దొరికింది. భర్త కాని భర్తతో కాపురం నీ సమస్య. దానికి పరిష్కారమేంటో నువ్వే ఆలోచించుకో.”

ఆమెను తనతో తీసుకెళ్ళటానికి కొడుకు సిద్ధంగానే ఉన్నాడు. ఆమెది తుఫానులో చిక్కుకున్న పరిస్థితి. నా సాయం కోరుతోంది.

“పూజ గదిలోనూ ఇప్పుడు నాకు శాంతి దొరకటం లేదు. ఈ సమయంలో అన్నయ్యలాంటి మీరు తప్ప నాకెవరున్నారు?”

అతను తనను తాను తెలుసుకొనేట్టు చెయ్యటమే నేను చెయ్యాల్సిన పని. రాత్రి బాగా పొద్దుపోయాక వచ్చాడు. నేను తన కుటుంబ విషయాల్లో జోక్యం చేసుకుంటున్నందుకు ఏమీ అనలేదు. అయితే తనను తాను కొత్తగా అర్థం చేసుకోవటానికి అతను సిద్ధంగా లేడు. “వాడికీ నాకూ ఇంక కుదరదు” అని తేల్చి చెప్పాడు.

“మరి ఆమె సంగతి?”

“దట్ బిచ్ డిసీవ్డ్ మీ” అన్నాడు కోపంగా.

ఆశ్చర్యంలో నుంచి తేరుకొని అన్నాను, “దేవకన్యలు అలాగే ఎగిరిపోతారు. అయితే నేనడిగింది ‘ఆమె’ గురించి కాదు. ఈమె గురించి.”

“నేనేమీ లోటు చెయ్యటం లేదు. నాతో ఉండటమా మానడమా అనేది ఆమె ఇష్టం.”

ఇప్పుడు అతని మొగమంతా నల్లమబ్బు వ్యాపించింది. బయటి లోటు గురించి తప్ప లోపలి లోటు గురించి ఆ మనిషి ఆలోచించటం లేదు. ఏవిధంగా చెప్పినా వినలేదు. తొలినాటి మెత్తదనం అతనిలో ఏ కోశానా లేదు. అది దృఢత్వం అని అతని విశ్వాసం. కాఠిన్యం అని నా అవగాహన. నచ్చకపోయినా బాల్యస్నేహాన్ని వదులుకోలేని బలహీనత నాది. ఆమెలోని దుఃఖపు చారికల్ని తుడవలేకపోయినందుకు విచారించాను. ఏదో భూకంపం రాబోతున్నదని ఒకానొక అస్పష్ట స్ఫురణ.

**“వాడు ఇంటి నుంచి వెళ్ళిపోయాడు” చెప్పింది ఏ ఉపోద్ఘాతం లేకుండానే.**

**అది కొడుకు సంగతి. ఎందుకని అడిగాను.**

**“తండ్రీ కొడుకులకి చాన్నాళ్ళ నుంచి సరిపడటం లేదు. తన వ్యాపారాలకు అండగా ఉండమని ఆయన ఒత్తిడి. ఆ పద్ధతులేవీ వాడికి నచ్చటం లేదు. నిన్న పెద్ద ఘర్షణే జరిగింది. మాట వినని కొడుకు నాకెందుకని ఆయన. దారి తప్పిన తండ్రి తనకీ అవసరం లేదని వాడు వెళ్ళిపోయాడు. వాళ్ళవి కోపాలు. నాది వేదన.”**

## ఆరో దృశ్యం

**స్థలం : గాలి, వెలుతురు లేని గది.**
**పాత్రలు : ఊచల లోపల అతను,**
**వెలుపల నేను.**
**విషయం : ఒక ఎరుక.**

“అంతా అయిపోయింది” అన్నాడతను నిట్టూర్చుతూ.

అతనిప్పుడు తన దేవేంద్ర భవనంలో కాక ప్రపంచంలో తానెక్కడ ఉండగూడదనుకుంటాడో అక్కడ ఉన్నాడు. ఒక్కసారి పరిసరాలు చూశాను. అది అతని పన్నెండు భవనాలు, బంగళాల్లో ఏ ఒక్కదానికంటే వందరెట్లు తీసికట్టు. ఎంతో ఇరుగ్గా. గాలి, వెలుతురు సరిగ్గా సోకకుండా ఉంది. రంగు వెలిసిన, పెచ్చులూడిన గోడలతో పాడుబడ్డ దెయ్యాల కొంపలా ఉంది. అతని నేలమాళిగని బ్రహ్మదేవుడు కనుక్కోకపోయినా మానవమాత్రులు కనుక్కున్నారు. కాగ్నైజబుల్ అఫెన్స్ సెక్షన్ 3 భూకంపంలో అంతా కుప్పకూలిపోయింది. హి ఈజ్ బాక్ టు స్క్వేర్ వన్.

“ఇక్కడ నీకు సౌకర్యంగా ఉందా?” అడిగాను.

“అంతా అయిపోయింది. సోషల్ స్టేటస్ కూడా. ఇంక దేన్ని గురించి ఆలోచించాలి? పెద్ద విశ్రాంతి. అయినా ఏదో తేలిగ్గా ఉంది.”

“నిజంగానేనా?”

విచిత్రంగా నవ్వాడు. నవ్వి నవ్వి పొలమారింది. ఆగినాక అతని కళ్ళల్లో నీటి తడి.

“ఇన్నేళ్ళుగా ఊపిరి తిరగని పనులు. ఉద్వేగం. తెరిపి లేని ఆలోచనలు తేనెటీగల ముసురులా. అప్పుడు ఏమాత్రం ఖాళీ లేకపోవటాన్ని ఆస్వాదించాను. ఇప్పుడొక కామా  పడింది. ఒక రకంగా తేలిగ్గా ఉంది.”

ఇన్నాళ్ళూ అతను చేస్తూ వచ్చిన నిర్మాణం రాను రాను అతని మీద పెనుభారమైంది. ఇప్పుడది తొలగిపోయింది. అతని కళ్ళల్లో మునుపటి దాహం, అంతులేని ఐశ్వర్యం కలిగించిన ధాటి, ఆధిపత్య గర్వం లేవు. ఐదున్నర అడుగుల కంటే చాలా కుంగిపోయాడతను.

కాసేపు ఆగి మళ్ళీ చెప్పాడు. “ఆమెను కొడుకు దగ్గరికి వెళ్ళమన్నాను. లోపలేదో తెలీని వెలితిగా ఉంది.”

“అది తెలుసుకోవడమే ముఖ్యం. ఇన్నాళ్ళూ పూరించలేని వాటితో నిన్ను పూరించుకున్నావు. పిరమిడ్ అట్టడుగున ఏముంటుందో ఎప్పుడూ ఆలోచించలేకపొయ్యావు” అన్నాను.

నిట్టూర్చాడు. అతనికా మాటలు అర్థమయ్యాయో లేదో తెలీదు. అతని వెనక గోడమీద బొగ్గుతో ఎవరో రాసిన వాక్యం నన్నాకర్షించింది.

‘నిన్ను నీవు కనుగొనుము’

అతని మారుతున్న రూపాన్ని నేనెప్పుడో గుర్తించాను. కాని దాన్ని అడ్డుకోలేకపొయ్యాను. ఇప్పటికైనా అతను తనను తాను సరిగ్గా కనుగొనగలడా?

“మీ సమయం అయిపోయింది” లాఠీ వ్యక్తి వచ్చి చెప్పాడు.

తిరిగి వెళ్తుండగా వెనకనుంచి అడిగాడు, “ఏం తోచటం లేదు. ఈసారి వచ్చేటప్పుడు ఏదన్నా ఒక పుస్తకం తెచ్చిపెడుదూ.”

తల ఊపాను. ఏ పుస్తకం తేవాలో కూడా నాకు తెలుసు. 'How much land does a man need.'

................................................................

రచయిత సెల్ : **85008 84400**

# కొత్త పుస్తకాలు

కర్నూలు జిల్లా నుంచి మహబూబ్‌నగర్ (పాలమూరు)కు వచ్చి స్థిరపడ్డ వల్లపురెడ్డి బుచ్చారెడ్డి సాహిత్యాన్నంతటినీ కలిపి ఇటీవల రెండు సంపుటాలుగా ప్రచురించారు. మొదటి సంపుటంలో కథలు, రెండవ సంపుటంలో కవితలు, వ్యాసాలు ఉన్నాయి. ఇవన్నీ 1954-67 మధ్య రాసినవి. మహబూబ్‌నగర్ పట్ల ఎంతో అభిమానాన్ని పెంచుకున్న ఈ సాహితీవేత్త ఆ జిల్లా, పట్టణ సామాజిక పరిస్థితులనే ఇతివృత్తాలుగా చేసుకుని కథలు అల్లారు. పాలమూరు జిల్లాలో ఆయనంత ఎక్కువ స్థాయిలో

## 'పాలమూరు'కు పెద్ద పీట




కథా రచన చేసినవారు లేరంటే అతిశయోక్తి కాదు. రచనలో ఆయన ఊహలు, కల్పితాలకన్నా నిజ జీవిత విషయాలు, పరిణామాల వైపే ఎక్కువ మొగ్గు చూపారు.

తెలుగు, హిందీ భాషలపైనే కాక, ఉర్దూ భాషపై కూడా పట్టు ఉండడంతో ఆయన రుబాయీలు, గజళ్లను కూడా రాశారు. రెండవ సంపుటం 'వల్లపురెడ్డి మధుగీత'లో ఇవన్నీ ఉన్నాయి. ఉర్దూ కవిత్వాన్ని ఆస్వాదించే రసికులకు నచ్చిన అనేక 'ముక్తకాల' అనువాద సంపుటే ఈ 'మధుగీత'. ప్రతి ముక్తకం ఒక మినీ కవిత. ప్రతి కవితలోనూ మధువును పొరించినందువల్ల ఆయన ఈ పుస్తకానికి మధుగీత అని పేరు పెట్టారు. ప్రతి ముక్తకంలోనూ ఓ ప్రణయ సందేశం కూడా అంతర్లీనంగా కనిపిస్తుంది. కథల్లోనే కాదు, ఆయన కవితలు, వ్యాసాల్లో సైతం వైవిధ్యం వ్యక్తమవుతుంది. అంతేకాదు అడుగడుగునా సామాజిక స్పృహ, దేశభక్తి, సామాన్య ప్రజల అభ్యున్నతి పట్ల ఒక విధమైన ఆరాటం బయటపడుతుంటుంది. కవితల కంటే కథలే ఎక్కువగా ఆకట్టుకుంటాయి.

**- జి. రాజశుక**

**వల్లపురెడ్డి సాహిత్యం** (రెండు సంపుటాలు)

**వల్లపురెడ్డి కథలు, వల్లపురెడ్డి మధుగీత, పేజీలు : , వెల :** ఒక్కో సంపుటి: రూ.300

**ప్రతులకు:** ఎస్.బి. కుసుమ్ కుమారి 94908 04157, అన్ని ప్రధాన పుస్తక కేంద్రాలు

---

**65-75** మధ్య కాలపు సాహితీప్రియులకు సుపరిచితమైన పేరు పరిమళా సోమేశ్వర్. యద్దనపూడి, ద్వివేదుల, మాదిరెడ్డి, చిట్టారెడ్డి, పోల్కంపల్లి వంటి రచయిత్రుల సమకాలీనురాలు. సాహిత్య లోకాన్ని రచయిత్రులు ఏలుతున్న కాలమది. అప్పటికే చలం, శ్రీపాద, రావిశాస్త్రి, బుచ్చిబాబు, కొకు వంటి మహామహులు రచనలు చేసినప్పటికీ రచయిత్రులపై శరత్ సాహిత్య ప్రభావమే ఎక్కువగా ఉండడం గమనార్హం. అందుకు పరిమళా సోమేశ్వర్ కథలూ మినహాయింపు కావు. ఈ సంపుటిలోని 42 కథల్లో ఒకటీ అరా ఇతర ఇతివృత్తాలతో ఉన్నప్పటికీ

## కాల గమనాన్ని ఒడిసిపట్టిన కథలు




ఎక్కువగా స్త్రీల చుట్టే తిరిగాయి. వంటింటి కుందేలు దశను దాటి విద్య, ఉద్యోగం, పురుషుడితో సమాన హక్కులు కోరుకునే దిశగా రచనలు సాగించారు.

'క్రోటను మొక్కలు' కథలో పద్నాలుగేళ్ల వయసు తేడాలో ఉన్న అక్కాచెల్లెళ్ల మధ్యగల భావ వైరుధ్యాన్ని స్పష్టంగా చెప్పారు. కుటుంబ బాధ్యతలు తలకెత్తుకుని పెళ్లి మాటెత్తని స్త్రీ ఒకరైతే, ఆచార వ్యవహారాల కంటే తన సుఖమే ముఖ్యమనుకుని గుట్టుచప్పుడు కాకుండా పెళ్లి చేసుకుని ఇల్లు వదిలి వెళ్లిపోయిన స్త్రీ మరొకరు. అప్పటి స్త్రీలలో పొడచూపుతున్న భావ స్వేచ్ఛకు ఉదాహరణ ఈ కథ. ఏ పాపం ఎరుగని సుజాత జీవితంతో విధి ఆడిన ఆటను ఆర్ద్రంగా చెప్పి పాఠకులచేత 'అయ్యో' అనిపించేలా రాసిన కథ 'తప్పెవరిది?'. ఆనాటి స్త్రీ పురుషుల స్వభావాల పరిశీలనలో విస్తృతమైన ప్రజ్ఞ కనబరచడానికి కారణం రచయిత్రి కళాశాల అధ్యాపకురాలుగా పని చేయడం కావొచ్చు. ముఖ్యంగా 60 - 70 దశకాల మధ్యతరగతి జీవితాలు, కుటుంబ వ్యవస్థ, సమాజ మార్పు .. కళ్ళకు కట్టినట్టు రాశారు. అయితే, క్లుప్తత పాటించకపోవడం వల్ల కొన్ని కథలు సాగదీసినట్టు అనిపిస్తాయి.

**- తహిరో**

**పరిమళా సోమేశ్వర్ కథలు**

**పేజీలు :** 460, **వెల :** రూ. 280, **ప్రతులకు :** నవచేతన, విశాలాంధ్ర

# ఇవీ వచ్చాయి

**ప్రసిద్ధ బాలల నాటికలు**
(1912 - 2000)
**సం. :** వల్లూరు శివప్రసాద్
**పేజీలు :** 380, **వెల :** రూ.280
**ప్రతులకు :** నవచేతన బుక్ హౌస్

---

**జాంపండ్లు**
(ముస్తాబాద్ బడి పిల్లల కథలు)
**ప్రధాన సం. :** గరిపెల్లి అశోక్
**పేజీలు :** 128, **వెల :** రూ.50

**చిట్టి చిట్టి మిరియాలు**
**రచన :** పాలపర్తి ఇంద్రాణి
**పేజీలు :** 80, వెల : రూ.50

**జీవన విద్య**
(బాలల వ్యక్తిత్వ వికాస కథలు)
**రచన :** డి.వి.కె. వాసుదేవన్
**పేజీలు :** 96, **వెల :** రూ.72

**ఇంగ్లీషుకు తల్లి తెలుగు**
(భాషా సాహిత్య హాస్య విమర్శలు)
**పేజీలు :** 186, **వెల :** రూ.144

**సరస్వతీ పుత్రులు**
(తెలుగు సాహితీ సుగంధాలు)
**పేజీలు :** 122, **వెల :** రూ.63

**కవులున్నారు జాగ్రత్త**
**పేజీలు :** 90, **వెల :** రూ.36
**రచన :** హాస్యబ్రహ్మ శంకర నారాయణ
**ప్రతులకు :** ప్రముఖ పుస్తక కేంద్రాలు

---

**కరెన్సీ కరువు**
**సంకలనం :** గడ్డం కోటేశ్వరరావు
**పేజీలు :** 152, **వెల :** రూ.120

**రామాయణ రహస్యాలు**
**రచన :** ఆచార్య కొత్త సత్యనారాయణ చౌదరి
**పేజీలు :** 146, **వెల :** రూ.120
**ప్రతులకు :** విశాలాంధ్ర బుక్ హౌస్

---

**సంగీత సాహిత్య సమరాంగణ సార్వభౌముడు శ్రీకృష్ణదేవరాయలు**
**రచన :** ఆచార్య వి. అరుణ కుమారి
**పేజీలు :** 256, **వెల :** రూ.196
**ప్రతులకు :** జ్యోతి బుక్ డిపో

---

**వ్యాస విరించి**
(తెలంగాణ సాహిత్య విమర్శ)
**రచన :** డా. వి. వీరాచారి
**పేజీలు :** 120, **వెల :** రూ.120
**ప్రతులకు :** నవచేతన, విశాలాంధ్ర

# అంగస్తంభన సమస్యకు ఆయుర్వేదమే బెస్ట్

**పురుషుల్లో** ఎక్కువ మందిని ఇబ్బంది పెడుతున్న సమస్య అంగస్తంభనం. దీనిని ఆయుర్వేదంలో నపుంసకత, క్లైబ్యంగా అని పేర్కొంటారు. శృంగారంలో పాల్గొన్నపుడు లేక హస్తప్రయోగం చేస్తున్నపుడు అంగం తగితనంతగా స్తంభించక పోవడం, లేక ఒక వేళ స్తంభించినా చివరి వరకు తగినంతగా స్తంభించి ఉండక పోవడాన్ని అంగస్తంభన సమస్యగా చెప్పవచ్చు. ఈ సమస్యతో బాధపడే వారిలో సెక్స్ కోరికలు మామూలుగానే ఉంటాయి. ప్రపంచవ్యాప్తంగా 10 కోట్ల మందికిపైగా పురుషులు అంగస్తంభన సమస్యతో బాధపడుతున్నారు. 40 ఏళ్లు దాటిన వారిలో 35 శాతం మంది, 50 ఏళ్లు దాటినవారిలో 50 శాతం మంది, 60 ఏళ్లు దాటిన వారిలో 60 శాతం మంది అంగస్తంభన సమస్యతో బాధపడుతున్నట్లు సర్వేల్లో వెల్లడైంది. మధుమేహం వ్యాధిగ్రస్థుల్లో ఈ సమస్యతో 60 శాతం మంది బాధపడుతున్నారు. ఈ సమస్యతో బాధపడే వారు మానసిక ఒత్తిడికి లోనుకావడం, వారిలో ఆత్మవిశ్వాసం తగ్గడం వల్ల డిప్రెషన్‌తో బాధ పడుతుంటారు.

### కారణాలు

అంగంలోనికి రక్తప్రసరణ జరగక పోవడం అన్నది అంగస్తంభన సమస్యకు ముఖ్యమైన కారణం. ఈ సమస్య శారీరక, మానసిక కారణాల వల్ల ఏర్పడుతుంది. వీటిలో కూడా 60 శాతం మందికి శారీరక కారణాలు 40 శాతం మానసిక కారణాలుగా చెప్పవచ్చు. మానసిక ఆందోళన, ఒత్తిడి, భయం, డిప్రెషన్, పెర్ఫామెన్స్ యాంగ్జైటీ మొదలగు మానసిక కారణాల వల్ల అంగస్తంభన సమస్య ఏర్పడుతుంది. డిప్రెషన్, పెర్ఫామెన్స్ యాంగ్జైటితో బాధపడుతున్న వారికి వారి సెక్స్ సామర్థ్యంపైన నమ్మకం లేనందున వారికి అంగస్తంభన సమస్య ఏర్పడుతుంది. మద్యం తీసుకోవడం, పొగతాగడం, గుట్కాలు నమలడం వల్ల కూడా ఈ సమస్య ఏర్పడుతుంది. హార్మోన్‌ల లోపాల వల్ల ముఖ్యంగా టెస్టోస్టిరాన్ హార్మోన్‌లోపం వల్ల అంగస్తంభన సమస్యకు దారితీస్తుంది. అధిక బరువు, కొలెస్ట్రాల్ ఎక్కువగా ఉన్న వారిలో కూడా ఈ సమస్య రావచ్చు. మధుమేహ వ్యాధిగ్రస్థుల్లో ఎక్కువగా నాడులు, రక్తనాళాలు వికృతి చెందడం వల్ల అంగస్తంభన సమస్య ఎక్కువగా వచ్చే అవకాశముంది. నాడీ సంబంధ వ్యాధులు, సుఖవ్యాధులు, కిడ్నీ సంబంధిత వ్యాధుల వల్ల కూడా ఈ సమస్య ఏర్పడవచ్చు. ఎక్కువ కాలం ఇతర వ్యాధులకు వాడిన మందుల వల్ల కూడా ఒక శాతం మందిలో అంగస్తంభన సమస్య వచ్చే ప్రమాదముంది. అధిక రక్తపోటు, గుండెజబ్బులు, డిప్రెషన్,అల్సర్, కేన్సర్ సంబంధిత వ్యాధులకు నొప్పి, వాపు తగ్గించే మందుల వల్ల కూడా ఈ సమస్య ఏర్పడవచ్చు.

### వ్యాధి నిర్ధారణ

నిపుణులైన ఆయుర్వేద వైద్యులను సంప్రదిస్తే, హార్మోన్‌ల పరీక్ష, పినైల్ డాప్లర్ వంటి పరీక్షలు చేయించి, వ్యాధిని నిర్ధారిస్తారు.

### ఆయుర్వేద వాజీకరణ చికిత్స

అంగస్తంబన సమస్యకు ఆయుర్వేదంలో ఎన్నో రకాల మంచి మందులు అందుబాటులో ఉన్నాయి. ఈ ఆయుర్వేద మందులు ఎలాంటి సైడ్ ఎఫెక్ట్సులు లేకుండా సెక్స్ సమస్యలకు శాశ్వత పరిష్కారాన్ని ఇస్తాయి. ఆయుర్వేదంలో కొన్ని వేల సంవత్సరాల క్రితమే శృంగార సమస్యలు, సంతానలేమి సమస్యల కోసం ప్రత్యేకంగా ఒక విభాగాన్నే ఏర్పాటు చేశారు. ఆ ఆయుర్వేద విభాగానికి 'వాజీకరణ చికిత్స'గా పేర్కొన్నారు. వాజీకరణ ఔషధాలు వాడినట్లయితే పురుషుల్లో అంగస్తంభన సమస్యతో పాటు, శృంగార సమస్యలు, సంతానలేమి సమస్యలు కూడా పూర్తిగా తొలగిపోతాయి.

డాక్టర్ ఎం. నరసింహ
ఎం.డి (ఆయుర్వేద), సెక్సాలజిస్ట్
యస్.బి. స్పెషాలిటీ క్లినిక్
అమీర్‌పేట్, హైదరాబాద్,
బ్రాంచీలు : విజయవాడ,తిరుపతి
ఫోన్స్ : 924656 4433,
939656 4433



### సమస్యలు రాకుండా...

మానసిక ఆందోళన, ఒత్తిడి రాకుండా యోగా, వ్యాయామం, వాకింగ్ వంటివి చేయాలి. మద్యం తాగడం, పొగతాగడం లాంటి అలవాట్లకు దూరంగా ఉండాలి. మనం తీసుకునే ఆహారంలో పాలు, పండ్లు, మినుములతో చేసిన పదార్థాలు ఎక్కువగా ఉండేటట్లు జాగ్రత్త వహించాలి.

# వీర్యకణాలు పెరిగే మార్గం లేదా?

**నా వయసు 35. ఏడేళ్ల క్రితం మా వివాహం అయ్యింది. ఇటీవల వీర్య పరీక్ష చేయించుకుంటే, నిల్‌కౌంట్ అని రిపోర్టు వచ్చింది. హార్మోన్ సంబంధిత లోపాలు మాత్రం నాకేమీ లేవని అయితే, నా వృషణాల మీద గ్రేడ్-1 'వెరికోసిల్' ఉందని చెప్పారు. రిపోర్టులు చూసిన డాక్టర్ శస్త్ర చికిత్స ఒక్కటే మార్గమని చెప్పారు. నాకు శస్త్రచికిత్స చేయించుకోవడం ఇష్టంలేదు. నా సమస్యకు ఆయుర్వేదంలో ఏదైనా పరిష్కారం ఉందా?**

**- రాములు, గుంటూరు**

వీర్యకణాలు అసలే లేకపోవడాన్ని అజోస్పెర్మియా అంటారు. వాస్తవానికి ఈ సమస్యతో బాధపడే వారి సంఖ్య రోజురోజుకూ పెరుగుతోంది. సంతానలేమితో బాధపడే వారిలో దాదాపు 15 శాతం మందిలో ఈ లోపం ఉంటోంది. ఇతర వైద్య విధానాల్లో ఈ సమస్యను నయం చేసే మందులు దాదాపు లేనట్లే. శస్త్ర చికిత్స అవసరం లేకుండా, కేవలం ఆయుర్వేద ఔషధాలతోనే ఈ సమస్యను తొలగించే అవకాశాలు సంపూర్ణంగా ఉన్నాయి. కాకపోతే, ఔషధాల్ని ఆరుమాసాల నుంచి ఏడాది దాకా వాడవలసి ఉంటుంది. వేరికోసిల్ గ్రేడ్-1 ఉన్న వారికి శస్త్ర చికిత్స లేకుండా, కేవలం మందుల ద్వారానే నయం చేసే అవకాశాలు కేవలం ఆయుర్వేదంలోనే ఉన్నాయి. అవి కేవలం వీర్యకణాల సంఖ్యను పెంచడంతోనే ఆగిపోకుండా రోగిని సంపూర్ణ ఆరోగ్యవంతుణ్ని చేస్తాయి.

**మాకు పెళ్లయి ఐదేళ్లు కావస్తోంది. కానీ, ఇంతవరకు సంతానం కలగలేదు. వైద్య పరీక్షల్లో వీర్యకణాల సంఖ్య తక్కువగా ఉందని, అలాగే ఆ కణాల కదలికలు కూడా తక్కువగానే ఉన్నాయని చెప్పారు. ఈ లోపం పోవడానికి ఇప్పటికే ఎన్నో రకాల మందులు వాడాను. అయినా ఫలితం లేదు. ఆయుర్వేదంలో నా సమస్యకు ఏదైనా పరిష్కారం ఉందా?**

**- నగేష్ ,హైదరాబాద్**

వీర్యకణాల సంఖ్య, వాటి కదలికలు తగ్గడాన్ని ఒలిగోలిస్థినో స్పెర్మియా అంటారు. వీర్య కణాల సంఖ్య గానీ, వాటి కదలికలు గానీ తగ్గడానికి వెరికోసిల్, హార్మోన్ లోపాలు, పొగతాగడం, మద్యపానం ప్రధాన కారణంగా ఉంటాయి. వీటితో పాటు వాతావరణ కాలుష్యాలు, మానసిక ఆందోళనలు కూడా ఈ స్థితికి కారణం కావచ్చు. ఆధునిక వైద్య విధానంలో ఈ సమస్య పరిష్కారం కోసం ఐవిఎఫ్, ఇక్సీ వంటి విధానాలను అనుసరిస్తూ ఉంటారు. అయితే ఆయుర్వేదంలో కేవలం ఔషధాలతోనే ఈ సమస్యను తొలగించే అద్భుతమైన అవకాశాలు ఉన్నాయి. సంతాన లేమి సమస్యలకు, సెక్స్ సమస్యలకు కూడా ప్రత్యేకమైన వాజీకరణ చికిత్సలు ఉన్నాయి. నిపుణులైన ఆయుర్వేద నిపుణుడి పర్యవేక్షణలో ఔషధాలను వాడితే మంచి ఫలితాలు వస్తాయి.

ADVT

